చుమ్బకః (పు) స్త్రీలోలుఁడు.

చుమ్బతి (ధా) ప - శప్ - చుబివక్త్రసంయోగే - ముద్దుపెట్టుకొనుచున్నాఁడు.

చుల్లః (త్రి) పుసిగండ్లవాఁడు-పుసికండ్లది

చుల్లిః (స్త్రీ) పొయ్యి.

చుమ్రవమ్ (న) ముఖము.

చూచుకమ్ (న) చనుమొన.

చూడః (పు) మగవానిజుట్టు - నెమలినెత్తినుండుజుట్టు.

చూడకః (పు) నుయ్యి.

చూడా (స్త్రీ) మగవానిజుట్టు నెమలినెత్తినుండుజుట్టు.

చూడామణిః (పు) కిరీటపుకొన-తలలోనిడికొనినరత్నము-గురివెందగింజ

చూడాలా (స్త్రీ) గుండ్రతుంగముస్తె-యోగినీవిశేషము.

చూతః పు) మామిడిచెట్టు.

చూర్ణమ్ (న) బుక్కా-మొదలైనది-పొడుములోభేదము.

చూర్ణకున్తలః (పు) ముంగురులు.

చూలికః (స్త్రీ) కోడి.

చూలికా (స్త్రీ) ఏనుఁగు చెవులయడుగుననుండు ప్రదేశము-కొప్పు

చూషా (స్త్రీ)ఏనుఁగునడుమునకు కట్టుతోలుపట్టె

చేటః (త్రి) జాత్యాచారనిందితుఁడు

చేటకః (పు) బంటు.

చేటికా (స్త్రీ) దాసిక.

చేటీ (స్త్రీ) తొత్తు

చేటతి (ధా) ప-శప్- చిటపరప్రేష్యే-యితరులచేతఁబంపబడుచున్నాఁడు

చేడి
చేడికా } (స్త్రీ) దాసిక - తొత్తు.

చేత్ (అ) అయితే- అట్లాయనా-ఎటువలెనైతేననుట.

చేతః (న) మనస్సు

చేతతి (ధా) ప-శప్ - తెలిసికొనుచున్నాఁడు.

చేతనః (పు) ప్రాణముగలది.

చేతనా (స్త్రీ) బుద్ధి.

చేదిః (పు) చేదిఅనేదేశము.

చేదిరాజః (పు) శిశుపాలుఁడు.

చేయమ్ (న) పరువడము.

చేలమ్ (న) వస్త్రము-కోక-నెమలికన్ను.

చేష్టతే (ధా) ఆ-శప్-చేష్టచేష్టాయాం-వ్యాపారము చేయుచున్నాఁడు.

చేష్టా (స్త్రీ) స్త్రీపురుషులవేడుక పనులు.

చైత్యమ్ (న) గుడి-బుద్ధమతస్థులయిల్లు-మునిగృహము-యాగశాల- రచ్చచెట్టు - మనస్సు- బింబము-సభ.

చైత్రః
చైత్రకః } (పు) చైత్రమాసము.

చైత్రరథమ్ (న) కుబేరునితోట.

చైత్రికః (పు) చైత్రమాసము.

చైద్యః (పు) చేదిదేశపురాజు.

చైద్యా (స్త్రీ) వెక్కుఁడుతీఁగె.

చోచమ్ (న) లవంగపుచెట్టు- తినగామిగిలినయున్నాదులు- తాటిపండు-అరటిపండు- టెంకాయ-నారపట్ట-తోలు,

చోచకమ్ (న) నారపట్ట.

చోడః (పు) చొక్కా - రవిక.

చ్యోతతి (ధా) తముపుచున్నాఁడు.

చోదమ్ (న) లవంగపుచెక్క.

చోపతి (ధా) ప-శప్-చుపనిందాయాం నిందించుచున్నాఁడు- వెడలుచున్నాఁడు

చోరః (పు) దొంగ - మంచిపరిమళము మారుఁడు.

చోరపుష్పీ } చోరీ } (స్త్రీ) కట్లచెట్టు.

చోలః (పు) చోలదేశమందుఁ బుట్టినవాఁడు.

చోలకః (పు) కవచము.

చౌరి (స్త్రీ) దొంగతనము.

చౌర్యమ్ (న) దొంగతనము.

చౌలమ్ (న) వడుగునకుముందుఁజేయు క్షౌరము - పుట్టువెంట్రుకలు తీయుట.

చ్యౌత్నః (త్రి) పర్ణము.

ఛ

ఛమ్ (న) సంవత్సరము.

ఛః (పు) కప్పుట - వెలుఁగు - ఊరు మొదలగువానిఁజుట్టునుండునది- ఆకులవలనఁ బుట్టిన శబ్దము - ఛరిణా.

ఛః (త్రి) పరిశుద్ధము-నాశములేనిది- మరిది - వేఱు.

ఛగలః (పు) మేక - నల్లనిబట్ట - బొద్దిచెట్టు

ఛగలకః (న) మేకపోతు.

ఛగలాణ్డీ (స్త్రీ) గాలదెగడపరచెట్టు.

ఛటాఫలః (పు) పోకచెట్టు.

ఛత్రమ్ (న) గొడుగు.

ఛత్రపర్ణః (పు) ఏడాకులఅరఁటిచెట్టు

ఛత్రభఙ్గః (పు) ముండమోయుట - స్వాతంత్ర్యములేకపోవుట- రాజాజ్ఞనతిక్రమించుట.

ఛత్రా (స్త్రీ) పిన్నసదాపచెట్టు - గొడుగువంటిగడ్డి - నల్లజీలకఱ్ఱ - ధనియాలు - నేలతాడిచెట్టు.

ఛత్రాకీ (స్త్రీ) సర్పాక్షిచెట్టు.

ఛదః (పు) ఆకు - ఱెక్క.

ఛన్దః (న) గాయత్రీమొదలైనవి - ఇచ్ఛ - వేదము.

ఛన్దః (పు) అభిప్రాయము.

ఛద్మ (న) కపటము - నెపము - వస్త్రము- ఇల్లు.

ఛన్దశ్చిత్ (పు) ఛందశ్చయనముఁజేయువాఁడు.

ఛన్నమ్ (న) రహస్యము.

ఛన్నమ్ (త్రి) కప్పఁబడినది.

ఛమతి (ధా) ప - శప్ - ఛమఅదనే - భక్షించుచున్నాఁడు.

ఛర్దనమ్ } ఛర్దమ్ } (న) వాంతి.

ఛర్దనః (పు) వేఁపచెట్టు

ఛలమ్ (న) యుద్ధమందు వెనకఁద్రొక్కుట.

ఛవిః (స్త్రీ) మెఱయుట - తేజస్సు.

ఛా (స్త్రీ) మఱుఁగు.

ఛాగః (న) మేక.

ఛాగః (పు) మేకపోతు.

ఛాగతుణ్డమ్ (న) పాములవాండ్రతంత్రము - ఉపాయము.

ఛాగలకః (పు) మేకపోతు - ఒకానొకచేప.

ఛాగీ (స్త్రీ) ఆఁడమేక.

ఛాతః (త్రి) నరకఁబడినది.

ఛాత్రమ్ (న) పెద్దతేనెగెలు పెట్టినతేనె.

ఛాత్రః (పు) శిష్యుఁడు.

ఛాదనమ్ (న) కప్పుట.

ఛాన్దసః (పు) వేదముఁజదివినవాఁడు.

ఛాదితః (త్రి) కప్పంబడినది- ఛేదింపఁబడినది.

ఛాన్దోగ్యమ్ (న) సామవేదోపనిషత్తు.

ఛాయా (స్త్రీ) కాంతి - సూర్యునిభార్యప్రతిబింబము - నీడ - ఏలుట - లంచము - కావ్యముయొక్కరీతి.

ఛాయాపుత్రః / ఛాయాత్మజః } (పు) శనిగ్రహము.

ఛిల్లికా (స్త్రీ) కొయ్యతోటకూర.

ఛితః (త్రి) నరకఁబడినది.

ఛిదా (స్త్రీ) నఱుకుట.

ఛిద్రమ్ (న) రంధ్రము.

ఛిద్రితః (త్రి) రంధ్రముఁచేయఁబడినది.

ఛిన్నమ్ (త్రి) నఱకఁబడినది.

ఛిన్నరుహా (స్త్రీ) తిప్పతీగె.

ఛిల్లిః / ఛిల్లీ } (స్త్రీ) చెట్టుమొదలైన వాని తొక్క.

ఛురికా / ఛురీ } (స్త్రీ) మొలనుంచుచూరికత్తి.

ఛుల్లిః (స్త్రీ) పొయ్యి.

ఛూలః (పు) సురటి.

ఛేకః (త్రి) పనులయందు నేర్పరి- పెంపుడుమృగాదులు.

ఛేకాపహ్నుతిః / ఛేకోక్తిః } (స్త్రీ) ఒకానొకయలంకారము.

ఛేదనమ్ (న) నఱుకుట.

ఛేదనీయః (పు) ఇందుపుచెట్టు.

జ

జమ్ (అ) పెండ్లాము.

జమ్ (న) మొలవగాలుమొదలగుయలంకారము - అలు - తేజస్సు - ఉదకము - పుట్టువు - ఎక్కు - కత్తి - మడుఁగు.

జః (పు) జనార్దనుఁడు - జవము - జయము - మేరువు- ధ్వని-జయించుస్వభావముగలపురుషుఁడు- పరులసంపదకు ఓర్వలేకపోవుట.

జః (న) పిరుదు - భూషణము- భార్య- తేజము - ఉదకము-పుట్టుక.

జక్షణమ్ (న) తినడము.

జక్షితః (త్రి) తినఁబడినది.

జగత్ (పు) వాయువు - ప్రాణి- లోకము-సంచరించువస్తువు.

జగత్ (పు) భువనము - ప్రపంచము.

జగతీ (స్త్రీ) భూమి - జగత్తు- జగతీచ్ఛందస్సుపండ్రెండవను లెక్క- వాస్తుపురుషుఁడు.

జగత్కర్తా (పు) బ్రహ్మ.

జగత్నుః (పు) నిప్పు-ప్రాణి..

జగత్ప్రాణః (పు) గాలి.

జగత్సాక్షీ / జగచ్చక్షుః } (పు) సూర్యుఁడు.

జగలః (పు) పిండిచేతఁజేసిన సారా.

జగ్ధః (త్రి) తినఁబడినది.

జఙ్గమః (త్రి) తిరుగులాడుమనుష్యాదులు

జగ్ధిః (స్త్రీ) భోజనము.

జఘనమ్ (న) దేశాచారముగా ముద్దుపె

ట్టుకొనుశృంగారరసప్రధానస్థానము స్త్రీలపిఱుదులమందు ప్రశస్త- పిఱుదు- స్త్రీలమడికట్టు

జఘనః (పు) తప్పితము - నేరము

జఘనేఫలా (స్త్రీ) బ్రహ్మమేడిచెట్టు.

జఘన్యమ్(న) వెనుకకంబుట్టినవాఁడు-తోక-డొక్క - శిశ్నము

జఘన్యః (పు) చివరది - నిందితుఁడు- శూద్రుఁడు.

జఘన్యజః (పు) తమ్ముఁడు - శూద్రుఁడు

జంఘా (స్త్రీ) పిక్క.

జంఘాలః (పు) దురుసుగానడిచెడువాఁడు.

జంఘాకరికః (పు) నడుపుచేబ్రతుకువాఁడు.

జజ్జలా (స్త్రీ) మాంసము.

జఝ్ఝా (స్త్రీ) గంజాయిచెట్టు.

జఙ్ఘాపథః (పు) నాలుగుత్రోవలుగలిసిన ధారి.

జఙ్ఘా (స్త్రీ) పిక్క.

జఙ్ఘాకరికః (పు) శీఘ్రముగాదూరముపెళ్లివార్తఁజెప్పెడువాఁడు

జఙ్ఘాప్రకోష్ఠరోమాణి (న) ముండమోపిగులుతు.

జంఝా (స్త్రీ) ధ్వనివిశేషము - సూక్ష్మముకానిది ఉదకమువర్షించుట.

జజతి / జంజతి (ధా) ప-శప్-జజజజియుద్ధ- యుద్ధముఁజేయుచున్నాఁడు.

జటా (స్త్రీ) చెట్టువూడ - కురువేరు- జటామాంసిచెట్టు - జెడకట్టినవెంట్రుకలు.

జటాటీరః (పు) హరుఁడు.

జటాయుః (పు) జాటాయువనుపక్షి-గుగ్గిలపుచెట్టు.

జటతి (ధా) ప-శప్-జటసంఘాతే- పోగుచేయుచున్నాఁడు.

జటీ (స్త్రీ) జువ్విచెట్టు.

జటులా (స్త్రీ) నల్లవస-జటామాంసి.

జటులః (పు) పుట్టుమచ్చ.

జఠరః (స్త్రీ) కడుపు,

జఠరః (త్రి) బిరుసైనది-కఠినవస్తువు.

జడమ్ (న) ఉదకము - సీసము.

జడః (పు) శీతవస్తువు.

జడః (త్రి) సుఖదుఃఖములెరుగకనూరకపన్నవాఁడు.

జతు (న) లత్తుక - లక్క.

జతుకమ్ (న) ఇంగువ - లక్క.

జతుకా / జతుకృత్ (స్త్రీ) చక్రవర్తికూరచెట్టు చీకురువాయి.

జత్రు (న) మెడకొంకులు.

జత్వాఘోటః (పు) కారుమొసలి.

జతూకా (స్త్రీ) కోరిందచెట్టు.

జనః (పు) మనుజుఁడు - మనుష్యలోకము.

జనకః (పు) తండ్రి - జనకమహారాజు పాదరసము

జనకా (స్త్రీ) ముత్తవపులగపుచెట్టు.

జననమ్ (న) పుట్టువు - వంశము.

జననీ (స్త్రీ) తల్లి - కోరిందచెట్టు.

జననీయమ్ (న) నెయ్యి.

జనతా (స్త్రీ) మనుష్యులగుంపు.

జనపదః (పు) పల్లెటూరు- గ్రామసమూహము

జనయితా (పు) తండ్రి.

జనయిత్రీ (స్త్రీ) తల్లి

జనశ్రుతిః (స్త్రీ) లోకప్రవాదము.

జన్మ (న) పుట్టువు.

జనఙ్గమః (పు) మాలవాఁడు.
జన్యా (స్త్రీ) అంగడి - అపవాదము.
జన్యః (త్రి) పెండ్లికొడుకు - చెలికాఁడు - యుద్ధము.
జనార్దనః (పు) విష్ణువు.
జనాశ్రయః (పు) మండపము-ఆస్థానము
జనీ (స్త్రీ) కోరిందచెట్టు - కోడలు.
జన్తి (పు) మనుష్యాదిజంతువులు.
జనుః (న) పుట్టువు.
జన్యుః (పు) ప్రాణి - బ్రహ్మ.
జన్తుః (పు) మనుష్యాదిజంతువులు.
జన్తుఫలః (పు) మేడిచెట్టు.
జపః (పు) బ్రహ్మయజ్ఞము - వేదాధ్యయనము - మంత్రము మరలమరలఁ జెప్పుట.
జపవటీ (స్త్రీ) జపమాలిక.
జపతి (ధా) ప-శప్-జపవ్యక్తాయాంవాచిమానసేచ - మాట్లాడుచున్నాఁడు - జపముఁజేయుచున్నాఁడు.
జపా } (స్త్రీ) దాసనచెట్టు.
జపాపుష్పీ }
జపాలః (పు) కురుమవాఁడు.
జభతే (ధా) ఆ-శప్-జభగాత్రవినామే శరీరమునువంచుచున్నాఁడు.
జటికా (స్త్రీ) పాడిపిండి.
జమతి (ధా) ప-శప్-జముఅదనే- భక్షించుచున్నాఁడు
జమదగ్నిజః (పు) పరశురాముఁడు.
జమ్పతీ (పు) ఆలుమొగల్లు
జమ్భభేదీ (పు) ఇంద్రుఁడు.
జమ్భలః } (పు) నిమ్మచెట్టు- జిల్లేడుచెట్టు-జంభలదేవత.
జమ్భః }
జమ్బాలః (పు) బురద-నాచులో భేదము.
జమ్భారిః (పు) దేవేంద్రుఁడు.
జమ్బీరః } (పు) నిమ్మచెట్టు-మరువము.
జమ్భీరః }
జమ్బుః (పు) నక్క.
జమ్బుకః (పు) మహాసాక్షిచెట్టు- దుందిలపుచెట్టు-మొగలిచెట్టు- నక్క- వరుణుఁడు-అల్పుఁడు.
జమ్బూః (స్త్రీ) ఏడుదీవులలో నొకటి - నేరేడుచెట్టు - దంతిచెట్టు- నేరేడుబండు.
జయః (పు) అఱువది సంవత్సరములలో నొకటి- జయించడము - జయంతుఁడు- విష్ణువుయొక్క ద్వారపాలకుఁడు.
జయదత్తః (పు) ఇంద్రునికొమారుఁడు.
జయనమ్ (న) జయము-గుఱ్ఱము మొదలగునవియుద్ధమునకై సన్నద్ధమగుట.
జయన్తః (పు)ఇంద్రునికొడుకు-శివుఁడు.
జయన్తీ (స్త్రీ) తక్కడచెట్టు-పసుపు-పార్వతీదేవి-నృసింహజయంతి మొదలయినది - సింధురాజు కూతురు-టెక్కెము.
జయ్యః (పు) జెయించఁదగిన శత్రువు.
జరత్ (త్రి) ముదిసినవాఁడు.
జరద్గవః (పు) ముసలియెద్దు.
జరా (స్త్రీ) ముదిమి.
జరాయుః (పు) మావి.
జరాయుజః (పు) మావివలనఁబుట్టినజంతువులు
జ్వరః (పు) జ్వరము.
జలః (పు) ఎఱ్ఱతామర - కురువేరు.

జలమ్ (న) ఉదకము-మూత్రము.
జలముక్ (పు) మేఘము.
జలశుక్తిః (స్త్రీ) కప్పచిప్ప　[పు.
జలజన్తుః (పు) ఉదకమునందుండెడిజంతు
జలనిధిః (పు) సముద్రము.
జలనిర్గమః (పు) కాలువ,
జలధరః (పు) మేఘము,
జలనీలీ (స్త్రీ) పాచి-నాచు.
జలవ్యాలః (పు) నీరుకట్టెపాము.
జల్పతి (ధా) ప-శప్ - జల్పవ్యక్తాయాంవాచి - మాట్లాడుచున్నాడు.
జలాధారః (పు) నీళ్లుండెడితావు.
జలాశయః (పు) మడుగు.
జలాశయమ్ (న) వట్టివేరు.
జల్పాకః (త్రి) మిక్కిలి ఆసహ్యపుమాటలాడువాడు.
జల్పితః (త్రి) చెప్పఁబడినది,
జలూకా (స్త్రీ) జెలగ - అంతరతామర.
జలోద్భవా (స్త్రీ) లఘుబ్రహ్మిచెట్టు.
జలౌకసః (స్త్రీ) జెలగ - నీటిబ్రబ్బచెట్టు
జవః (త్రి) శీఘ్రముగావెళ్లువాఁడు.
జవనః (పు) త్వరితముగాఁబోవుగుఱ్ఱము-ఒకానొకదేశము.
జసురిః (పు) వజ్రము.
జహ్నుతనయా (స్త్రీ) గంగ.
జా (స్త్రీ) గంగానది-ఉపస్నము-సముద్రపు చెలియలికట్ట
జాగరః (ద్వా) మేలుకొనడము.
జాగరీ / జాగరూకః } (త్రి) మేలుకొనువాఁడు
జాగర్యా (స్త్రీ) మేలుకొనడము.
జాఙ్గలికః (పు) విషవైద్యుఁడు.

జాఙ్ఘికః (పు) త్వరగా దూరమువెళ్లివర్తమానముఁజెప్పెడువాఁడు.
జాతః (త్రి) పుట్టినది - అయినది.
జాతవేదాః (పు) అగ్ని.
జాతరూపమ్ (న) బంగారము-ఉమ్మెత్త.
జాతాపత్యా (స్త్రీ) బిడ్డలుగనుస్త్రీ
జాతిః (స్త్రీ) సత్త్వాదిసామాన్యధర్మము- ఉసిరికచెట్టు-ఛందస్సు - పుట్టువు-సంతతి-తనకువిరోధముగుమాటపొయ్యి-భూషణము- జాజిచెట్టు.
జాతు (అ) ఒకానొకప్పుడు.
జాతుమః (త్రి) లక్కబొమ్మ.
జానిః (స్త్రీ) రాజగృహమ్
జానుః (పు) మోకాలు,
జాపకమ్ (న) పచ్చగంధము.
జాబాలః (పు) మేకలఁగాచువాఁడు.
జామాతా (పు) అల్లుడు-పెనిమిటి - సూర్యమండలము.
జామిః (స్త్రీ) అత్తచెల్లెలు-కులకాంత.
జామ్బవమ్ (న) నేరేడుబఢడు.
జామ్బూనదమ్ (న) బంగారము-ఉమ్మెత్త
జాయా (స్త్రీ) పెండ్లాము.　[వాఁడు.
జాయాజీవః (పు) వేషముఁగట్టిజీవించెడు
జాయాపతీ (పు) ఆలుమొగల్లు.
జారః (పు) అంకుమగఁడు.
జాలమ్ (న) వల - కిటికీ - సముదాయము-మొగ్గ.
జాలకమ్ (న) కిటికీ-లేతమొగ్గ- సాలెపురుగు-మగ్గము-పిట్టగూడు-పొట్లాము.
జాలాటనీ (స్త్రీ) జెలగ.
జాలికః (పు) జాలరివాఁడు- వలచేతప్పగపక్షులనుఁబట్టిజీవించువాఁడు.

జాలీ (స్త్రీ) పొట్లచెట్టు.

జావాలః (పు) కురుమావాఁడు.

జాహ్నవీ (స్త్రీ) గంగా.

జ్యా (స్త్రీ) భూమి - వింటినారి-తల్లి.

జ్యాయాన్ (త్రి) ముసలివాఁడు- పసం దయినది - అన్న.

జిఘత్సుః (త్రి) ఆకలిగొన్నవాఁడు.

జిఘాంసుః (పు) పగవాఁడు.

జింజీ (స్త్రీ) మంజిష్ఠచెట్టు.

జితేన్ద్రియః (పు) నక్క.

జిత్వరః (త్రి) గెలిచెడిస్వభావముఁగలవాఁడు.

జినః (పు) బుద్ధమతదేవత- మిగులముసలివాఁడు - ఇఱువదినాలుగు - జయించే స్వభావముగలవాఁడు.

జిష్ణుః (పు) దేవేంద్రుఁడు - అర్జునుఁడు- విష్ణువు - హరుఁడు - సంసారముత్యజించే స్వభావము గలవాఁడు - కొండశిఖరము.

జిహ్మః (త్రి) వంకర.

జిహ్మగః (పు) పాము - మెల్లఁగాబోవువాఁడు - కుటిలుఁడు.

జిహ్వా (స్త్రీ) నాలుక - పలుకు - మంట

జీనః (త్రి) ముసలివాఁడు.

జీమూతః (పు) మబ్బు - కొండ- ఏనుఁగు - ఇంద్రుఁడు - హరుఁడు - చంద్రుఁడు - మేఘము -నరకాసురునిసారథి.

జీరకః }
జీర్ణః } (పు)జీలకఱ్ఱచెట్టు- జీలకఱ్ఱ.

జీర్ణః (త్రి) ముసలివాఁడు

జీర్ణవస్త్రమ్ (న) పాతబట్ట

జీర్ణిః (స్త్రీ) ముదియడము - పాతగిలడము-నశించడము.

జీవః (పు) బృహస్పతి - బ్రతకడము.

జీవకః (త్రి) వేగిసపుచెట్టు- జీవకమనే గ్రంధ్యము - క్షవణకమతస్థుఁడు- వడ్డివల్లబ్రతికేవాఁడు - పాములవాఁడు

జీవనమ్ (న) ఉదకము - బ్రతుకుదారి - ప్రాణాధారము-అప్పుడుతరచిచిలికిన వెన్న-చెట్టుచేవ.

జీవనీయమ్ (న) ఉదకము.

జీవన్తికా (స్త్రీ) వదనిక - తిప్పతీఁగె - నీరుచిట్టిచెట్టు - పాలకూర - కరకచెట్టు.

జీవన్తీ (స్త్రీ) పాలకూర - జమ్మి-తిప్పతీగె.

జీవనీ }
జీవనీయా } (స్త్రీ) పాలకూరచెట్టు

జీవనౌషధమ్ (న) బ్రతికించుమందు.

జీవా (స్త్రీ) తంత్రులక్రిందవుంచేజవ - గొంగలిపీచు - పాలకూరచెట్టు- వింటినారి - వస - పుడమి - శబ్దించుట - జీవనము

జీవాతుః (పు) బ్రతికించేమందు.

జీవాన్తకః (పు) కొయ్యకోఁటమూర- పిట్టలుబట్టేవాఁడు

జీవికా (స్త్రీ) బ్రతుకుదోవ.

జీవితకాలః (పు) ఆయుస్సు.

జు (న) కీర్తి - యుద్ధము.

జుగుప్సా (స్త్రీ) నింద - దయ.

జుజ్జః (పు) బొద్దికూర.

జుజ్జతి (ధా) ప - శప్ - విడుచుచున్నాఁడు.

జాహురాణః (పు) గుణ్ణము-గాలి- సేవకుం
డు - అగ్ని - అశ్వర్యుండు.

జాః (పు) జీవము - ఆకసము - పిశా
చము.

జూటః (సీ) గుండ్రిగాదలకుంజుట్టుకొని
నజెడలగుంపు.

జూతిః (సీ) వేగముగాంబోవుట.

జూర్ణిః (సీ) వేగము - జిల్లేడుచెట్టు - ర
త్నము-అగ్ని - సూర్యుండు.

జూర్తిః (సీ) ఒకానొకజ్వరము.

జృమ్భః (త్రి) ఆవలింత - ఒళ్లువిరుచుకొ
నుట- వికసించుట- పూచుట.

జృమ్భణమ్ (న) ఆవలింత

జృమ్భతే (ధా) ఆ - శప్ - జృభిగా
త్రవినామే - శరీరమునువంచు
చున్నాండు.

జేతా (పు) జయస్వభావుండు.

జేమనమ్ (న) భోజనము.

జేమతి (ధా) ప-శప్-జిమఅదనే- భక్షిం
చుచున్నాండు.

జేయః (పు) జయింపందగినపగవాండు

జైత్రః (పు) ఇంద్రునితేరు-గెలిచెడుస్వ
భావముంగలవాండు.

జైవాతృకః (త్రి) చంద్రుండు - ఆయు
ష్మంతుండు.

జోఙ్గకః (పు) అగరువృక్షము.

జోటీ (సీ) దుప్పటి.

జోనకః (త్రి) ఎఱుపురంగధిక్యముగా గలి
సినసలుపువర్ణముంగలది.

జోతతే(ధా) ప్రకాశించుచున్నాండు

జోనలః } (పు) జొన్నలు.
జోనాలః }

జోషమ్ (అ) సుఖముగా - ఊరక -
ఒక్కమారుగా.

జౌతిషికః (పు) జ్యోతిష్కుండు.

జ్యోత్స్నా (సీ) వెన్నెల.

జ్యోత్స్నీ (సీ) పొట్లతీగె - వెన్నెల
రాతిరి.

ఝ

ఝః (పు) బ్రహ్మ - అండె - ప్రతాపము-
తుమ్మెద - నశించడము - దొంగ-
గాలివాన - మదము.

ఝకటః (సీ) జగడము.

ఝఞ్ఝావాతః (పు) వర్షముతో గూడి
నగాలి.

ఝటతి (ధా) ప - శప్ - ఝటసంఘా
తే- పోగుచేయుచున్నాండు.

ఝటితి (అ) శీఘ్రముగాను.

ఝణ్టీ (సీ) నల్లములు గోరంట.

ఝమతి (ధా) ప-శప్ ఝమ-అదనే -
భక్షించుచున్నాండు.

ఝరః (పు) కొండయందుంబుట్టినజలప్ర
వాహము.

ఝర్ఝరః (పు) జాగంట - కెంపులకులంః
పలనలుసుగానుండుట - పుష్య
రాగదోషము - గోమేధదోష
ము - కలియుగము - వాద్యఘట
ము-నదవిశేషము.

ఝరుకా } (సీ) చిమట.
ఝల్లికా }

ఝషః (పు) చేప - మొసలి-పంటెము.

ఝషా (సీ) బీరచెట్టు.

ఝాటలః (పు) మొక్కపుచెట్టు.

ఝాబుకః (పు) పక్కెచెట్టు.

## ఞ

ఞః (పు) సమూహము- దేశము - గర్వము - గంధాదులయొక్కపూత- శిరస్సు - గాడిదకూత.
(త్రి) ఊర్ధ్వముఖమైనది - మూఢస్వరూపమయినది.
(న) భయము - కీర్తి.

## ట

టః (పు) కాకి - పొగ - ధనుస్సు - సూర్యకిరణము - శబ్దము - తలుపు- మాట-కొడుకు- చమరీమృగము
(స్త్రీ)భూమి- పలుమారుబలుకుట.
టకః (పు) గొల్లవాఁడు - ఇష్టుఁడు.
టఙ్కః (పు) గర్వము - వెలిగారము-
(స్త్రీ)గుద్దలి-మోకాలు - కత్తియొర - తవ్వుగోల - పిక్క.
టీకతే, టేకతే (ధా) పోవుచున్నాఁడు.

## ఠ

ఠమ్ (న) చంద్రమండలము - కట్టుట - పిల్లనగ్రోవినాదము - ఘంటచప్పుడు.
ఠః (పు) శివుఁడు - చంద్రమండలము.
ఠక్కుః (త్రి)అబద్ధముచెప్పువాఁడు.

## డ

డమ్ (న) యుద్ధము - పోకూడనితావు- డమరకమనువాద్యము- పల్లకి.
డః (పు) దేశము - శివుఁడు - నవ్వు-భయము - జయశబ్దము - శంఖశబ్దము - రౌద్రరసము - [illegible].
డమరః (పు) దేశోపద్రవము.
డమరుః (పు) వాద్యభేదము.
డయనమ్ (న) ఆకాశమందు ఱెక్కలు కదలకుండాపోవడము.
డహుః (పు) కమ్మరేఁగుచెట్టు.
డా (స్త్రీ) లజ్జ - వాక్కు.
డాలిమః (పు) దాడిమచెట్టు.
డాహుకః (పు) భరతపిట్ట.
డిఙ్గరః (పు) సేవకుఁడు - ఖడ్గమృగము ప్రేరేపించుట.
డిణ్డిమః (పు) వాద్యభేదము.
డిణ్డీరః (పు) సముద్రపునురుఁగు
డిమ్భః (పు) దేశోపద్రవము-శిశువు- చన్నుగుడుచుపాప - మూర్ఖుఁడు.
డుణ్డుకః (పు) దుందిలపుచెట్టు.
డుణ్డుభః (పు) రెండుతలలశిఖిండి.
డుపికా (స్త్రీ) పడవ - పుట్టిమొదలగునవి.
డోలా (స్త్రీ) నీలిచెట్టు - డోలీ.
ఢమ్ (న) జ్ఞానము - వాద్యముఖము.

## ఢ

ఢః (పు) దయ్యము - భయము - కాలుము - అనురాగము - కొడుకు కుక్క.
ఢక్కా (స్త్రీ) ఢమణము.
ఢఙ్కః (పు) అచ్చుబోసినయాబోతు.
ఢౌకతే (ధా) పోవుచున్నాఁడు.

[illegible] (పు) జారుఁడు - [illegible]ము - గ[illegible] - ధ్వని.
ణః (పు) రాత్రి - పొన్న[illegible]ము- కుక్క-దయ[illegible]జ్ఞానము.

## త

(అ) పుణ్యము.
(పు) సంయోగము - నిశ్చయము - ఆగ్రహము - తోక - పరస్పర విరోధమునుంగలుగఁజేయు మాటలు - దొంగ.
తకతి (ధా) ప-శక్-చంపుచున్నాఁడు.
తక్కోలా (స్త్రీ) తక్కోలపుచెట్టు.
తక్రమ్ (న) మజ్జిగ.
తఙ్కతి (ధా) ప-శక్-క్రమముగా జీవించుచున్నాఁడు.
తఙ్గతి (ధా) ప-శక్-నడుచుచున్నాఁడు.
త్యక్తః (త్రి) విడిచిపెట్టఁబడినది.
త్యక్తమ్ (న) ఒకలెక్కలోమరియొకలెక్కతీసివేయడము.
తఞ్చతి (ధా) ప - శక్ - తంచుగకో-పోవుచున్నాఁడు.
త్వచమ్ (న) లవంగపుచెక్క.
త్వచః (పు) శరీరమందలితోలు - చెట్ల నారపట్ట.
త్వచిసారః (పు) వెదురు.
తటమ్ (న) ఏటిఒడ్డు.
తటః (పు) ఏటిఒడ్డు - కొండశిఖరమునకుఁగ్రిందియున్నప్రదేశము.
తటతి (ధా) ప-శక్ - తటఉచ్ఛ్రాయే-వృద్ధిపొందుచున్నాఁడు.
తటాకః (పు) చెఱువు.
తటిత్ (స్త్రీ) మెఱుపు.
తటిత్త్వాన్ (పు) మబ్బు.
తటినీ (స్త్రీ) నది.
తణ్డులః(ద్వ)వాయువిడంగము-బియ్యము
తణ్డులీయః (పు) చిర్రిచెట్టు - వాయువిడంగపుచెట్టు- వడ్లుమొదలైనవి.
తణ్డూః (ద్వ) కొయ్యాలెద్దు.
తత్ (త్రి) మఱియొకటి.
(అ) హేతువు.
తతః (అ) కారణము - అందువలన-అడుగుట - తరువాతను- నేర్పతీతనము - మోసముచేయుమాట.
తత్పరః (త్రి) ఆసక్తిగలవాఁడు.
తత్వమ్ (న) ఆలస్యముగా.
తత్కాలః (పు) వర్తమానకాలము.
తథ్యః (త్రి) సత్యము.
తథా<br>తథానీమ్ } (అ) అప్పుడు.
తథా (అ) వలెను - అలాగు - పరస్పర నిరపేక్షములగు నవయవ వస్తువులకునొకక్రియతో సంబంధముగలుగుట - పరమార్థము - ఉత్తరువుచేయుట - నిశ్చయము - నిందించుట - శెస్స - సాంతము - యోగ్యమగుపని.
తథాగతః (పు) బుద్ధదేవుఁడు.
తనయః (పు) కుమారుఁడు.
తనయా (స్త్రీ) కూఁతురు.
తనుః (స్త్రీ) సన్నపుది - కొంచపుది- వెలితిగలబట్టమొదలైనది.
తనుః (న) శరీరము.
తనుత్రమ్ (న) కవచము.
తనూః (స్త్రీ) ఒడలు.
తనూనపాత్ (పు) నిప్పు.
తనూరుహమ్ (న) పిట్టఱెక్క.
తనూకృతమ్ (న) చెక్కఁబడినది.

తన్తువాయః (పు) సాలెపురుగు.

తన్త్రమ్ (న) మగ్గము.

తన్త్రః (పు) తనరాష్ట్రమునుగుఱించిచింతించుట - వ్యాకరణాదిశాస్త్రము- ప్రధానుఁడు.

తన్త్రికః (త్రి) కొత్తబట్ట.

తన్త్రికా (స్త్రీ) తిప్పతీగ.

తన్త్రీ (స్త్రీ) వీణతంతులు - తిప్పతీఁగె- నరాలు.

తన్ద్రీ (స్త్రీ) కునికిపాటు - సొమ్మసిలపోవుట.

తపమ్ (న) తపస్సు.

తపః (పు) మాఘమాసము-గ్రీష్మఋతువు

తపనః (పు) సూర్యుఁడు- నల్లజీడిచెట్టు- చిన్ననెల్లిచెట్టు

తపనీ (స్త్రీ) గోదావరీనది.

తపనీయమ్ / తపనీయకమ్ } (న) బంగారము.

తపనేష్టమ్ (న) రాగి.

తపస్యః (పు) ఫాల్గుణమాసము - అర్జునుఁడు.

తపస్వినీ / తపస్వీ } (స్త్రీ) జటామాంసి.

తపోధనః (పు) సన్యాసి - ఋషి.

తప్తరూపకమ్ (న) వెండి.

తప్తుమ్ (అ) తపస్సుచేసేటందుకు.

తమమ్ (న) చీఁకటి,

తమః (న) రాహుగ్రహము - మూడుగుణములలోఁగడపటిది - దీనత్వము - చీఁకటి - దుఃఖము - మోహము - గొంగళి - గుబుతు - రొమ్ము.

తమరమ్ / తమరకమ్ } (న) తగరము.

తమస్వినీ (స్త్రీ) రాతిరి - పసపు.

తమా (స్త్రీ) రాత్రి- తమాలవృక్షము.

తమాః (పు) పరాగము - ధూళి - ముట్టు.

తమాలః (పు) నేలయుసిరికచెట్టు - నిమ్మచెట్టు- తిలకవృక్షము - ఖడ్గమృగము-ఉలిమిడిచెట్టు

తమాలపత్రమ్ (న) నొసటిబొట్టు.

తమిః (స్త్రీ) రాత్రి

తమిస్రమ్ (న) అంధకారము.

తమిస్రా (పు) చీకటి.

తమీ (స్త్రీ) రాత్రి

తమోజ్యోతిః (పు) మెఱుగుడుబురుగు.

తమోనుత్ / తమోపహః } (పు) నిప్పు-చంద్రుఁడు- సూర్యుఁడు- దీపము.

తమోభిత్ (పు) మిణుగురుబురుఁగు.

తమోమణిః (పు) మెఱుగుడుబురుఁగు.

త్రపతే (ధా) ఆ- త్రప్ - త్రపూషలజ్జాయాం - సిగ్గుపడుచున్నాఁడు.

త్రపా (న) సిగ్గు-ఱంకులాడి- కులము- ఖ్యాతి.

త్రపుః (న) తగరము - సీసము.

త్ర్యబ్దా (స్త్రీ) మూడేండ్లపెయ్య.

త్ర్యమ్బకః (పు) హరుఁడు.

త్ర్యమ్బకసఖః (పు) కుబేరుఁడు

తయతె (ధా) ఆ - తయ్ - తయగతౌ - వెళ్లుచున్నాఁడు

తరః (న) వేగము - మాంసము - దేహబలము.

తరః (పు) పడవ - పుట్టిమొదలయినవి అగ్ని - వృక్షము.

తరక్షుః } (పు) సివంగి
తరక్షుకః }

తరఙ్గః (పు) అల - కెరటము.

తరఙ్గిణీ (స్త్రీ) ఏఱు - పసపు.

తరణిః (స్త్రీ) పిన్నగోరంటచెట్టు- ఓడ-దాటడము - ఏఱు - కుమారియ నునౌషధము.

తరత్ (పు) తెప్ప - కప్ప - నీటికోడి-మాలవాఁడు-తుంగముస్తలు.

తరపణ్యమ్ (న) ఓడదాటించేకూలి

తరలః (పు) నాయకరత్నము-జారుఁడు-మెఱయునట్టిది-సాలెవాండ్లపల్లె

తరస్వీ (పు) పెద్దపులి - శీఘ్రముగాఁబోవువాఁడు - శూరుఁడు.

తరళా (స్త్రీ) గంజి - కల్లు.

తరిః } (స్త్రీ) ఓడ-అవస్థ- బట్టలుమొదలు
తరీః } యినవాటిపెట్టె.

తరీషా (స్త్రీ) ఓడ.

తరుః (పు) చెట్టు

తరుణః (పు)పిన్నవయస్సువాఁడు-పొట్టివాఁడు-పువ్వు- ఆముదపుచెట్టు

తరుణీ(స్త్రీ)దుష్టపుచెట్టు-సురుగుడుచెట్టు-పదియారుసంవత్సరములు మొదలుకొనిముప్పదియాఱుసంవత్సరములలోపువయసుఁగలయాఁడుది

తర్కః (పు) ఊహించుట - ఇచ్ఛ- తర్కించడము

తర్కారికః (పు) కాకిగూఁడు.

తర్కారీ (స్త్రీ) తక్కెడుచెట్టు.

తర్జతి (ధా) ప - శప్ - తర్జభత్సనే- భయపెట్టుచున్నాఁడు

తర్దతి (ధా) హింసించుచున్నాఁడు.

తర్ణకః (పు) అప్పుడుపుట్టినదూడ - శిరిసెనచెట్టు - ఇదే - శిరిసెపుచెట్టు

తర్జనీ (స్త్రీ) జుట్టనవ్రేలు.

తర్ణిః (పు) పడవ - పుట్టిమొదలయినది

తర్పణమ్ (న) పితృదేవతలకుతృప్తికరముగుతర్పణము - పితృయజ్ఞము- తనివి - తృప్తిపొందడము.

తర్మ (న) యజ్ఞమునందు నాటియున్నయూపస్తంభముయొక్కచివరకొన

తర్షః (పు) ఇచ్ఛ-దప్పి- అత్యాదరము-మున్నీరు-తెప్ప-కప్పసూర్యుఁడు.

తర్హి (అ) అప్పుడు - అడుగుట - ఉత్తరము - క్షణము - వెంటనే - అప్పుడే

త్రభతి (ధా)ప-శప్-నడుచుచున్నాఁడు

త్రయీ (స్త్రీ) వేదము - వేదత్రయము - మూడింటిగుంపు -ఏనుగుకాళ్లకుగట్టెడుసంకిలి - పతివ్రత - మంచిమనస్సుగలది

త్రయీతనుః (పు) సూర్యుఁడు.

త్రయీధర్మః (పు) వేదవిహితధర్మము.

త్వరితః (త్రి) త్వరగాఁబోవువాఁడు.

త్వమ్ (త్రి) నీవు

త్వక్ (స్త్రీ) లవంగపుచెక్క - జ్ఞానేంద్రియములలోనొకటి.

త్వఙ్గతి (ధా)ప-శప్-నడుచుచున్నాఁడు.

తలమ్ (న) బెజ్జము - అఱచెయ్యి- అఱకాలు - దూదివేళికుట్టిన పరుపు క్రిందిది.

తలత్రమ్ (పు) నారిదెబ్బతగలకుండాచేతికికట్టిన ఉడుపతోలు.

తలః (పు) తాటిచెట్టు - జేన.

తలః (స్త్రీ) చెంపదెబ్బ - కత్తిపిడి.
తలనః (పు) ఇత్తి.
తలినమ్ (న) నిర్మలమైనది-శయ్య.
తల్పః (పు) గుఱ్ఱపురౌతు.
త్వాః (పు) మతిరొుకటి
తష్టః (త్రి) చెక్కబడినకాష్టాదికము.
తస్కరః (పు) మంగచెట్టు- కాకిదొం డచెట్టు - తోఁడేలు - దొంగ.
తస్కరీ (స్త్రీ) కొండవెండచెట్టు. [డు.
త్రసతి(ధా)ప-శప్-చేష్టలుచేయుచున్నా
త్రబ్కతే (ధా) షోవుచున్నాఁడు.
త్రసః (త్రి) మనుష్యమృగపక్ష్యాదులు.
త్రసరః (పు) సాలెవాఁడు-నూలుకండె.
త్రస్తమ్ (న) వెఱపు.
త్రస్నుః (త్రి) భయపడువాఁడు.
త్వష్ట్రః (పు) వడ్లవాఁడు
తక్షకః(పు)తక్షకుఁడు-వడ్లవాఁడు. [లు.
తాటఙ్కః(పు) బంగారపు మెరుఁగుకమ్మ
తాడః (పు) కొట్టుట - శబ్దము - పిడికెడు గడ్డిమొదలైనది - కొండ.
తాడకః (పు) దేవతాడిచెట్టు.
తాడఘా (స్త్రీ) సుత్తె.
తాడితమ్ (న) గుణకారము.
తాడీ (స్త్రీ) నేలయుసిరిక.
తాణ్డవః (స్త్రీ) పురుషనాట్యము.
తాతః (పు) తండ్రి - దయ.
తాన్త్రికః (పు) విషవైద్యుఁడు - తాంత్రికమతస్థుఁడు - సూర్యసోమసిద్ధాంతములఁ దెలిసినవాఁడు.
తాపః (పు) సంతాపము.
తాపసీ (స్త్రీ) ఒకానొకమంత్రము-ఒకానొకనది - రేయి.

తాపసః (పు) కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతములనాచరించువాఁడు.
తాపసతరుః (పు) గారచెట్టు.
తాపిఞ్ఛః (పు) సముద్రతీరమందలి నల్లని ఆకులుఁగలచీకటిచెట్టు.
త్రాణః } త్రాతః } (త్రి) రక్షించఁబడినది.
త్రాపుసః(త్రి)తగరపుబొమ్మమొదలైనది
తామరసమ్ (న) కమలము - రాగి - బంగారము.
తామలకీ (స్త్రీ) నేలఉసిరికచెట్టు
తామ్రపర్ణీ (స్త్రీ) అంజనమను దిగ్గజముభార్య
తామ్రకమ్ (న) రాగి.
తామ్రకుట్టకః (పు) కంచరివాఁడు.
తాయతే (ధా) ఆ-శప్- తాయృసంతానపాలనయోః - పాలించుచున్నాఁడు - ప్రబంధము జేయుచున్నాఁడు.
త్రాయన్తీ (స్త్రీ) కలుక్రాంతచెట్టు.
త్రాయమాణా (స్త్రీ) కలుగ్రానుగుచెట్టు.
తారః (ద్వ) నల్లగుడ్డు- నిర్మలమైనముత్యము.
తారకా (పు) రిక్క - నల్లగ్రుడ్డు- కోరెందచెట్టు
తారకజిత్ (పు) కుమారస్వామి.
తార్క్ష్యః (పు) గరుత్మంతుఁడు- గుఱ్ఱము. మాక్షికపర్వతమునఁ బుట్టినధాతువు - అరదము - మద్దిచెట్టు - ఏపెచెట్టు - ఎఱుపు
తారా (స్త్రీ) చుక్క - సుగ్రీవునిపెండ్లాము-బృహస్పతియాలు-బుద్ధదేవి.

తారాపథమ్ (న) ఆకాసము
తారుణ్యమ్ (న) పదియాఱేండ్లు మొద లుకొని యేఁబదేండ్లవఱకుఁ గల వయస్సు.
తారేయః (పు) బుధుఁడు - అంగదుఁడు.
తాలమ్ (న) పిడి-వాద్యములు వాయిం చుకంచుకుండ - హరిదళము - తాలీసుపత్రము - దుర్గా-సింహాస నము- తాటిపండు
తాలః (పు) ఖాతవేయడము- తాలపాత్రిక్రియావిశేషము అనఁగా త్రిపు టాదితాళములు - తాటిచెట్టు- లాడితెదుకంటె హెచ్చు - య త్నధూపము - హరిదళము - కళ లుండుస్థలము-విల్లు- అఱచెయ్యి.
తాలపర్ణి (స్త్రీ) పిన్నసదాపచెట్టు- ముర యనేయోషధి
తాలమూలికా (స్త్రీ) నేలతాడిచెట్టు.
తాలీ (స్త్రీ) నేలయుసిరికచెట్టు- నేలతాఁ డిచెట్టు - శ్రీతాళము - తామ్రవల్లిచెట్టు
తాలు (న) నోటిలోపలిదౌడ.
తావత్ (అ) అంతాను - అందాకాను- అంతమాత్రము- ప్రశంస- పౌర్ణ మ్యమావాస్యలు.
త్రాసః (పు) భయము.
తాళః (పు) తాటిచెట్టు.
తాళపత్రమ్ (న) చెవులకమ్మ.
తాళీ (స్త్రీ) శ్రీతాళవృక్షము.
తిక్తః (పు) చేదు-చేతిపొట్లతీఁగె- చిర్ల చెట్టు.
తిక్తకః (పు) పర్పాటకపుచెట్టు
తిక్తశాకః (పు) ఉలిమిడిచెట్టు.
తిగ్మమ్ (న) మిక్కిలివేడి.
త్రికమ్ (న) మూడనుసంఖ్య-మూడుద్రవ్యములగుంపు-ముడ్డిపూస.
త్రికకుత్ (పు) త్రికూటపర్వతము.
త్రికటు (న) సొంఠి - పిప్పలి-మిరియా లు - యేలకులు - అకుపత్రిక ము-లవంగాలకూటమి.
త్రికా (స్త్రీ) నూతిమీఁదిగిలక - పీఠము మొదలైనది.
త్రికూటః (పు) త్రికూటపర్వతము.
తితఉః (స్త్రీ) జల్లెడ.
తితిక్షా (స్త్రీ) ఓరుపు
తితిక్షుః (త్రి) ఓరుపుఁగలవాఁడు.
తిత్తిరిః (పు) తీతువుపిట్ట - ఒకానొ కముని.
తిథిః (ద్వి) రాత్రింబగలు- చంద్రునికళ పూర్తిపదియేను.
తినిశః (పు) నెమ్మిచెట్టు.
తిన్త్రిడీకమ్ (న) చింతపండు.
తిన్త్రిణీ (స్త్రీ) చింతచెట్టు.
తిన్త్రిణీకమ్(న) చింతపండు-చింతచెట్టు.
తిన్దుకః (స్త్రీ) నల్లతుమికిచెట్టు
త్రిదశాలయః (పు) స్వర్గము-మేరుగిరి- అనగాబంగారుకొండ.
త్రిదశః (పు) దేవత.
త్రిదివః (స్త్రీ) స్వర్గము-ఆకాసము.
త్రిదివేశః (పు) దేవత.
తిమిః (పు) నూరామడపొడవుఁగల చేప
తిమింగిలః (పు) తిమియనుచేఁపనుమ్రింగునట్టితిమింగిలమనుచేఁప.
తిమితః (త్రి) తడిసినది.

త్రిమిరమ్ (న) చీకటి - కంటికివచ్చురోగము.
త్రిపథగా (స్త్రీ) గంగ.
త్రిపుటా (స్త్రీ) తెల్లతెగడ - ఎఱ్ఱతెగడ.
త్రిపురాన్తకః (పు) శివుఁడు.
త్రిఫలా } (స్త్రీ) కరకతాడిఉసిరికలు.
త్రిఫలీ }
త్రిభణ్డీ (స్త్రీ) తెల్లతెగడ.
తిరస్కరిణీ (స్త్రీ) తెర-చీర-పరదా.
తిరస్క్రియా (స్త్రీ) లక్ష్యపెట్టకఁబోవుట
తిరీటమ్ (న) చుట్టచుట్టినది-కిరీటము.
తిరోహితః (త్రి) పారిపోయి డాగియున్నవాఁడు
తిరోధానమ్ (న) కప్పుట - అగుపడకఁబోవుట.
తిలః (పు) నువ్వులు.
తిలకః (స్త్రీ) బొట్టు
తిలకమ్ (న) గర్భములోకుడిప్రక్కనుండుమాంసఖండము - నల్లసౌవర్చలవణము
తిలకాలకః (పు) పుట్టుమచ్చ
తిలపిఞ్జః } (పు) పొల్లనువ్వులు.
తిలపేజః }
తిలపర్ణికా (స్త్రీ) ఎఱ్ఱనిగంధము.
తిల్యః (త్రి) నువ్వులు.
తిల్వః (పు) లొద్దుగుచెట్టు.
తిలిప్పః (పు) కొండచిలువ.
తిలోత్తమా (స్త్రీ) ఒకానొకయప్సరస.
త్రియమ్బకః (పు) శివుఁడు.
త్రియామా (స్త్రీ) రాత్రి.
త్రిలోచనః (పు) శివుఁడు.
త్రివిష్టపమ్ (న) స్వర్గము.
త్రివిక్రమః (పు) విష్ణువు.
తిష్యః (పు) ఇరువదేఁడు నక్షత్రములలోనొకటి
తిష్యకః (పు) పుష్యమాసము.
తిష్యఫలా (స్త్రీ) ఉసిరికచెట్టు
త్రిసన్ధ్యమ్ (న) ప్రాహ్ణాపరాహ్ణ మధ్యాహ్నములు అనగా ఉదయమువమధ్యాహ్నముసాయంత్రము.
త్రిసీత్యః (త్రి) ముమ్మారుదున్నినపొలము
త్రిస్రోతాః (స్త్రీ) గంగానది.
త్రిహల్యః (త్రి) ముమ్మారుదున్నినపొలము
త్రిహాయనీ (స్త్రీ) మూడేండ్లపెయ్య.
త్విట్ (స్త్రీ) కాంతి-అగ్ని-జ్వాల.
త్విషా (స్త్రీ) తేజస్సు
త్విషాంపతిః (పు) సూర్యుఁడు.
తీకః (పు) చంద్రుఁడు.
తీకతే (ధా) అ-కప్-పోవుచున్నాఁడు.
తీక్ష్ణమ్ (న) వేడిమి-ఇనుము - విషము-యుద్ధము-శస్త్రము.
తీక్ష్ణగన్ధకః (పు) మునుఁగచెట్టు.
తీరః (అ) అడ్డముగా - కప్పడముఅనఁగా లేకుండాచేయడము - మాహాత్మ్యము - మహిమ-విచిత్రము నాశము-వేరైనది - జరిగినకాలము-ప్రబలమగుట-చావు.
తీర్థమ్ (న) నీళ్లు-రేవు-జన్నము- శాస్త్రము- మహాత్ములుస్నానముఁజేయుమడుఁగు - రాజులాలోచనఁజేయుస్థలము మొదలగు పదునెనిమిదిస్థలములు - అయోధ్యా, మధురాదిపుణ్యభూములు- క్షేత్రము-మట్టురక్తము - నూతివద్దిగాడి-

గంగా,గోదావరి మొదలగునదు
లు- ఆగమశాస్త్రము
తీర్థః (పు) యతిసంప్రదాయభేదజ్ఞానా
ర్థచిహ్నము-గురువు.-యోని-సా
ధనము [డి.
తీవ్రః(త్రి)అతిశయమయినది-చేఁదు-వేఁ
తు (అ) పాదపూరణము-అయ్యోవే- వి
శేషము-నిశ్చయము-మర్యాదఁజే
యుట-కారణము - అభిప్రాయ
ము-నిద్దుర - దూరమునుంచిపిలు
చుట - వికారము - శుభము-పా
ల్లాడుట.
తుఙ్గః (పు) పొన్నచెట్టు-కొండ
తుఙ్గీ (స్త్రీ) వాయింటచెట్టు - ఏపెచెట్టు-
పసపుచెట్టు.
తుచ్ఛమ్(న)దుఃఖము-అల్పము-తక్కువ
తుజ్ఞతి (ధా) ప-శప్-తుజిపాలనే - ప్ర
భుత్వముఁజేయుచున్నాఁడు.
తుటనః (పు) ఎనిమిదిసంవత్సరములలోఁ
పువయస్సుఁగలవాఁడు.
తుణ్ణతే(ధా) ఆ-శప్ - బద్దలుఁజేయుచు
న్నాఁడు- హింసఁజేయుచున్నాఁ
తుణ్డమ్ (న) పిట్టముక్కు. [డు
తుణ్డకేరీ (స్త్రీ) ప్రత్తిచెట్టు-దొండచెట్టు
తుణ్డిభః } (త్రి) పొడవైనబొడ్డుఁ గల
తుణ్డిలః } వాఁడు.
త్రుటిః (స్త్రీ) సన్నయేలకులు-అల్పకాల
ము-సంశయము.
త్రుటీ (స్త్రీ) కొంచమైనది.
తుత్థః (పు) నిప్పు-కాటుక.
తుత్థా (స్త్రీ) నీలిచెట్టు
తుత్థాఞ్జనమ్ (న) మైలతుత్తము.

తున్తువాయః (పు) సాలెవాఁడు.
తున్దః (పు) గోధుమలు.
తున్దమ్ (న) కడుపు
తున్దపరిమార్జః } (త్రి) బద్ధకుఁడు.
తున్దపరిమృజః }
తున్ది (న) కడుపు.
తున్దిభః(పు)పెద్దకడుపుగలవాఁడు.
తున్దిలః (త్రి) బొజ్జగలవాఁడు - ఉరుకు
బొడ్డుఁగలవాఁడు.
తున్దుభః (పు) ఆవాలు.
తున్నః (పు) నందివృక్షము.
తున్నవాయః (పు) బట్టలుకుట్టువాఁడు
తుబరః (పు)కొమ్ములేనిఆవు-పేడివాఁడు.
తుములః (త్రి) దొమ్మియుద్ధము- వ్యాకు
లమైనది
తుమ్పతి (ధా) ప-శప్ - తుంపహింసా
యాం-చంపుచున్నాఁడు
తుమ్ఫతి (ధా) ప - శప్-తుంఫహింసా
యాం చంపుచున్నాఁడు
తుమ్బతి (ధా)ప-శప్-తుబిఅర్దనే-పోవు
చున్నాఁడు- యాచించుచున్నాఁ
తుమ్బా (స్త్రీ) సొరచెట్టు. [డు.
తురమ్ (న)వేగము-ధనము-ఏనుఁగశాల.
తురః (పు)ుబాణము.
తురగః (పు) గుఱ్ఱము-మనస్సు
తురఙ్గః (ద్వి) } గుఱ్ఱము.
తురఙ్గమః (పు) }
తురఙ్గవదనః (పు) గుఱ్ఱపుమొగముమను
ష్యస్వరూపముఁగలవాఁడు.
తురాషాడ్ (పు) దేవేంద్రుఁడు [ము.
తురుష్కః(పు)తురుష్కమనుగంధద్రవ్య
తులా(స్త్రీ)తులయనెడురాసి- ఏలకిచెట్టు-

సూరుపలములయొక్కబంగారము-పీతముమీఁదికట్టి - తూచడము - సామ్యము - తూచేతక్కడతాౘ్ను మొదలైనది - ఇంటికివేసెడు తులావాసము-మండ

తులాకోటిః (పు) పావడము-బిరుదు.

తువరః (ద్వి) ఒగరు

తువరికా (స్త్రీ) తొవరిమన్ను- కందులు

తుషః (పు) ధాన్యపుపొల్లు-తాటిచెట్టు

తుషారః (పు) మంచు-తుంపర-దేశభేదము-చంద్రుఁడు

తుషితః (పు) ముప్పదియాఱుగురు,తుషితులను దేవజాతి - ముప్పదియాఱుసంఖ్య.

తుహినమ్ (న) మంచు-చంద్రునియొక్కతేజన్ను

తూర్కః (పు)నాట్యమందలిపదునాలుగంగములలోవిశేషము- అనగా

తూడతి (ధా) ప - శప్-తూడతోడనే ప్రతిఘాతముఁ జేయుచున్నాఁడు

తూణః (ద్వ) అంబులపొది

తూణీ (స్త్రీ) ఉమ్మెత్తచెట్టు-నీలిచెట్టు-అంబులపొది.

తూణీరః (పు) అంబులపొది

తూదః (త్రి) గంగరావిచెట్టు

తూబరః (పు) కొమ్ములులేనిపశువు-పేడివాఁడు.

తూర్ణః (పు) శీఘ్రముగాఁబోవువాఁడు

తూలః (పు) ప్రత్తిమొదలైనదూది

తూలతి (ధా)ప-శప్- తూలనిష్కర్షణే వెళ్లఁగొట్టుచున్నాఁడు

తూలికా(స్త్రీ)కాగిదమువ్రాసెడుకలము - పటచిత్రకారులు వ్రాసేకుంచె-దూదిపరుపు

తూష్ణికామ్
తూష్ణీమ్
తూష్ణీకామ్ } (అ) ఊరకే

తృటిః (స్త్రీ) తామరపూరేకును సూదితోపొడిచినంతసేపు- పిన్నయేలకితీగె-అల్పపరిమాణము-సందియము

తృణమ్ (న) గడ్డి-చెఱకు

తృణధ్వజః (పు) వెదురు [డు.

తృణశూన్యమ్(న) మల్లిచెట్టు-మొగలిపం

తృణరాజాహ్వయః (పు) తాటిచెట్టు.

తృణ్యా (స్త్రీ) కసువులగుంపు.

తృతీయాకృతః (త్రి) మున్మారుదున్నినపొలము

తృతీయాప్రకృతిః (స్త్రీ) నపుంసకుఁడు.

తృప్తః (పు) యజ్ఞమునందుహోమముఁ జేయునట్టి అన్నాదులు.

తృప్తిః (స్త్రీ) తనివి

తృమ్పతి
తృమ్ఫతి } (ధా)ప-శప్-తృంపహింసాయాం-చంపుచున్నాఁడు

తృపత్ (పు) చంద్రుఁడు

తృషా (స్త్రీ) అత్యాదరము - దప్పి-ఇచ్ఛ-కామకన్య - కొబ్బరిచెట్టు

తృష్ణా (స్త్రీ) ఇచ్ఛ-దప్పి

తే (అ) నీచేతను అన్నమాట

తేకతే (ధా) ఆ-శప్-పోవుచున్నాఁడు.

తేజః (న) పృథివ్యప్తేజోవాయ్వాకాశములలోనొకటి - తేజన్సు- బలము-పరాక్రమము- పందికొఱ-నిప్పు- వెన్న -బంగారము- తైక్ష్ణ్యము అసహనము-శీఘ్రవు

తేజతి (ధా) ప-శప్-తేజపాలనే- ప్రభుత్వముఁజేయుచున్నాఁడు- ప్రకాశించుచున్నాఁడు.

తేజనః (పు) వెదురు.

తేజనకః (పు) కాకివెదురు

తేజనీ (స్త్రీ) చాఁగచెట్టు-వెఱ్ఱుడుతీఁగె

తేజితః (త్రి) వాఁడిగాఁజేయబడినది

త్రేతా (స్త్రీ) కలియుగమునకు మూఁడు రెట్టయినత్రేతాయుగమను పేరుగల మూఁడవయుగము- దక్షిణాగ్ని గార్హపత్యాహవనీయముల నెడు మూఁడగ్నులు

తేపతే(ధా) ఆ - శప్- తిప్పృక్షరణే-స్రవించుచున్నది - తేపృకంపనేచ-కదులుచున్నాఁడు - తేపృగతౌ-వెళ్లుచున్నాఁడు

తేమః (పు) తడియడము

తేమనమ్ (న) పచ్చపట్టిపేళ్లు- పులుసు-శ్రమము.

తేవతే (ధా) ఆ - శప్ - తేవృదేవనే-దుఃఖించుచున్నాఁడు

తైజసావర్తనీ (స్త్రీ) మూస

తైత్తిరమ్ (న) తితువులగుంపు

తైలపర్ణికమ్ (న) తెల్లగంధము

తైలపాయికా (స్త్రీ) గబ్బిలము ఎఱ్ఱాకు లతోఁటకూరచెట్టు.

తైలీనః (త్రి) నువ్వులుపండు క్షేత్రము.

తైషః (పు) పుష్యమాసము.

తోకమ్ (న) బిడ్డ.

తోక్మః (పు) పచ్చయవలు.

తోజతి (ధా)ప-శప్-తుజహింసాయాం చంపుచున్నాఁడు

త్రోటిః (స్త్రీ) పిట్టముక్కు-చేపముక్కు.

తోడతి (ధా) ప - శప్ - తుడృతోడనే-నిరోధించుచున్నాఁడు.

తోత్రమ్ } తోదనమ్ } (న) ఏనుఁగునుబెదిరించుటకు ఎములుకోలకఱ్ఱ.

తోపతి (ధా) ప - శప్ - తుపహింసాయాం-హింసించుచున్నాఁడు.

తోఫతి (ధా)ప-శప్-తుఫహింసాయాం చంపుచున్నాఁడు.

తోమరః (స్త్రీ) చిల్లకోల.

త్రోపతి (ధా) ప- శప్ - త్రుపహింసాయాం-చంపుచున్నాఁడు.

తోయమ్ (న) ఉదకము

తోయపిప్పలీ (స్త్రీ) నీరుపిప్పలిచెట్టు.

తోరణః (స్త్రీ) తలవాకిలిద్వారమునందుకట్టినతోరణము

తౌర్యత్రికమ్ (న) నృత్తగీతవాద్యభేదము

త్రౌకతే(ధా) ఆ-శప్-పోవుచున్నాఁడు.

## థ

థమ్ (న) బ్రహ్మసాక్షాత్కారము - మోక్షము- గాయత్రీజపముఁజేయుట

థః (పు) అల-చందురుఁడు-కొండ.

థః (త్రి) తెలుపు-నలుపు-విస్తారము.

## ద

దమ్ (న) త్రాగుట - విరక్తి - ఆలుఁ-చూచుట.

దః (పు) ఈశ్వరుఁడు-గురుఁడు.

దః (త్రి) ఈవిగలవాఁడు - ముక్కలుఁజేయుట-ఇంటికొాస- ద్రవద్రవ్యము - పశుద్ధము.

దగ్ధః (త్రి) కాల్చఁబడినది.

దగ్ధికా (స్త్రీ) మాడినవంటకము.

దక్షతి (ధా) ప-శప్-దక్షపాలనే - పాలించుచున్నాఁడు.

దణ్డః (పు) సూర్యునిపార్శ్వమందుండెడువాఁడు-బారెడు - చిలుక-శత్రువునుపీడఁబెట్టడము - ప్రవరలు - యముఁడు - గుఱ్ఱము-కవ్వము.

దణ్డః (స్త్రీ)దండుగ-హింసఁబెట్టుట - దుడ్డుకఱ్ఱ- కొమ్మలక్రిందిమ్రాను-కొలిచెడుకఱ్ఱ-పూలదండ- అభిమానము-దండు-మూలగ్రహము.

దణ్డధరః (పు) యముఁడు-రాజు.

దణ్డనీతిః (స్త్రీ) కామందాదిచాణక్యదండనీతిశాస్త్రము.

దణ్డశూకః (పు) పాము.

దణ్డవిష్కమ్భః (పు) తరికంబము.

దణ్డాహతమ్ (న) చల్ల.

దణ్డీ (పు) యముఁడు-దౌవారికుఁడు-పిండము-పట్టణము-గానుగపిండి.

దదతే (ధా) ఆ-శప్-ఇచ్చుచున్నాఁడు.

దద్రుఘ్నః (పు) తగిరిశచెట్టు.

దద్రుణః (పు) } కుష్ఠభేదముఁగలవాఁడు.
దద్రురోగీ (త్రి) }

దధతే (ధా) ఆ-శప్-ధరించుచున్నాఁడు

దధిఫలః } (పు) వెలగచెట్టు.
దధిత్థః }

దనుజః (పు) రాక్షసుఁడు.

దన్తభాగః (పు)ఏనుఁగుయొక్క-శిరస్సు-తొండ-మొదలయినది.

దన్తశఠః (పు) వెలగచెట్టు - పచ్చిపులుసు-నిమ్మచెట్టు-ములువెలగచెట్టు

దన్తః (పు) పల్లు - ముప్పదిరెండు-కొండనడుము - పొందతిల్లు-పొదత్రాయి.

దన్తశఠా (స్త్రీ) పులిచింత

దన్తధావనః (పు) చంద్రచెట్టు.

దన్తావలః } (పు) ఏనుఁగు.
దన్తీ }

ద్వన్ద్వమ్ (న) జంట - యుద్ధము-రహస్యము-యజ్ఞపాత్రము,

ద్రప్సమ్ (న) తోడుబెట్టినకుండలోయడుగుననుండుపెరుగు - తోడుబెట్టినకుండలోనిపైపెరుగు.

దభ్రః (త్రి) సన్నపది - కొంచపది.

దమః (పు) చతురుపాయములలో నొకటి- ఇంద్రియనిగ్రహాదిక్లేశసహనము - బురద.

దమథః (పు) ఇంద్రియనిగ్రహాది క్లేశసహనము- కఱ్ఱ

దమితః (త్రి) శిక్షింపఁబడినది.

దమునాః (పు) అనలుఁడు - రాక్షసుల గురువు

దమ్పతీ (పు) ఆలుమగండ్రు,

దమ్భః (పు) కపటము-కల్కము.

దమ్భోలిః (పు) ఇంద్రాయుధము.

దయతే (ధా)ఆ-శప్-దయదానగతిరక్షణహింసాదానేషు - దానము-వెళ్లడము-రక్షణ-హింస- స్వీకారముఁజేయుచున్నాఁడు

దయా (స్త్రీ) తొమ్మిదిరసములలోనొకటియగుకరుణారసము - దయ.

దయాలుః (త్రి) దయగలవాఁడు.

దయితః (త్రి) ఇష్టవస్తువు

దర (అ) తక్కువ - ఇంచుకత.
దరః (పు) భయము - శంఖము.
దర్పకః (పు) మన్మథుఁడు.
దర్పణః (పు) తాలప్రాణఘాతమైనరోమ
కానారకకళ.
దర్పణః (సీ) అద్దము.
దర్భః (పు) కుశదర్భగడ్డి - గడ్డిలోభేద
ము-అశ్వలాయనదర్భ
దర్శః (పు) అమవస-ఇష్టి-చూపు.
దర్శనమ్ (న) చూడడము-అద్దము - స్వ
ప్నము-బుద్ధి-శాస్త్రము-చూపు-
ధర్మము-కనుపడడము
దర్శకః (పు) వాకిటిపారాప్వాఁడు - దౌ
వారికుఁడు-చూపించువాఁడు-నే
ర్పరి - జాణ.
దరిద్రః (పు) ధనహీనుఁడు
దరీ (సీ) గోడవలెనుండుకొండదరి -
గుహ
దర్వీ (సీ) పడగ-ఇత్తడిగరిటె.
దర్వీకరః (పు) పాము- వంటపుట్టి-యా
చించువాఁడు - యజ్ఞముఁజేయు
వాఁడు.
దర్దురః (పు) దర్దురమనువిషము- కప్ప-
దర్దురపర్వతము-దర్దురధాన్యము-
మబ్బు
దవః (పు) దావానలము - అడవి-అగ్గి-
గుబ్బము

దవిష్ఠః } (త్రి) మిగులదూరమున
దవీయాన్ } నున్నది.

ద్రవః (పు) స్త్రీపురుషులవినోదము-వేగ
ద్రవన్తీ (సీ) ఎలుకచెవిచెట్టు [ము.
ద్రవ్యమ్ (న) సొమ్ము-మంచిపదార్థము
ద్రవిణమ్ (న) బలము - ధనము.
దశనః (పు) పల్లు.
దశబలః (పు) బుద్ధదేవుఁడు.
దశమీ (త్రి) తొంబదేండ్లుమించినవాఁ
దశరూపభృత్ (పు) విష్ణువు. [డు.
దశనవాసః (న) పెదవి.
దశమీస్థః (పు)వీర్యపటుత్వముఁబోయిన
వాఁడు
దశా (సీ) దీపపువత్తి - అవస్థ బట్టకొన
అనగాచెంగు-ఆయుస్సునందుఁబ
దియవభాగము-ఆశ.
దృశ్యమ్ (న) రాగి
దస్యుః (పు) దొంగ-పగవాఁడు.
దస్రః (పు) కిరణము - గాడిద.
దహనః (పు) అగ్నిహోత్రుఁడు- నల్లజీ
డిచెట్టు - చిత్రమూలము - దు
ర్వ్యాపారము.
దశః (పు) ఆకు
దక్షః (పు) విశ్వదేవతలలోనొకఁడు-శ
రీరముదాచనిబంటు - సనత్కు
మారుఁడు-కోడి - సమర్థుఁడు-ద
క్షప్రజాపతి - అగ్నిహోత్రుఁడు-
శివుఁడు-ఋషి.
దక్షాయ్యః (పు) గరుడపక్షి.
దక్షిణః (పు) పరకార్యనిర్వాహకుఁడు.
దక్షిణస్థః (పు) రథముఁదోలెడువాఁడు.
దక్షిణా (సీ) దానముతరువాతయిచ్చె
డుదక్షిణ. [యందు.
దక్షిణా (అ) దక్షిణదిక్కు-దక్షిణదిక్కు
దక్షిణాగ్నిః(పు)యజ్ఞమునందు వేదికకు
దక్షిణప్రక్కను ధనురాకారకుం
డమునందుఁబ్రతిష్ఠచేసినయగ్ని

దక్షిణార్హః } (త్రి) దక్షిణకుఁదగినవాఁడు.
దక్షిణీయః }

దక్షిణేర్మా (పు) కుడిభాగమునందుగాయమయినలేడి.

దా (స్త్రీ) ఓరవు-ఈవి

ద్రావకః (పు) ద్రావకమను ఔషధము.

దాఖతి (ధా) వ-శబ్-పీల్చుచున్నాఁడు.

దాడిమః (పు) దానిమ్మచెట్టు. [ట్టు

దాడిమపుష్పకః (పు) ములుమోదుఁగుచె

దాతః (త్రి) కోయఁబడినది.

దాత్రమ్ (న) కొడవలి.

ద్వాదశాఙ్గులః (పు) జేనెడు.

ద్వాదశాత్మా (పు) సూర్యుఁడు.

దానమ్ (న) ఇవ్వడము-శత్రువునకేమైనయివ్వడము- ఏనుఁగుచెక్కిళ్లయందుఁబుట్టెడుమదము-పరిశుద్ధము-ముక్కలుఁజేయుట-ఏలుట

దానవః (పు) రక్కసుఁడు.

దానవారిః (పు) దేవత-వెన్నుఁడు.

దానశౌణ్డః(పు)ఎక్కువగానిచ్చువాఁడు

దాన్తః (త్రి) శిక్షించఁబడినది

దాన్తః (పు) దవనపుచెట్టు - తపస్సునందుఁ బ్రయాసమును సహించెడువాఁడు.

దాన్తిః (స్త్రీ) ఇంద్రియనిగ్రహముమొదలగుఁబ్రయాసమునుసహించుట

దాపితః (త్రి) తగవునందోడినవాఁడు

ద్వాపరః (పు) రెండుకలియుగములంతయినద్వాపరయుగము- సంశయము.

దామ (పు) పలుపు-ఉరదాడు. [ము.

దామనీ (స్త్రీ) దామెనత్రాఁడు.

దామోదరః (పు) విష్ణువు.

దాయాదః(పు) కొడుకు-నక్షత్రలోకము

దారదః (పు) ఒకానొకవచ్చనిజాతిపాము-విషము - పాదరసము- ఇంగిలీకము

దారా (స్త్రీ) పెండ్లాము.

దార్వాఘాటః (పు) వడ్లంగిపిట్ట.

దారితః (త్రి) బద్దలుగొట్టఁబడినది.

దార్వికా (స్త్రీ) ఎద్దువాలుకచెట్టు

దార్ఢ్యసేతః (పు) వాకిటికావలివాఁడు.

దారుః (స్త్రీ) కఱ్ఱ - దేవదారుచెట్టు

దారుణః (త్రి) భయానకరసముఁగలది.

దారుహరిద్రా (స్త్రీ) మ్రానుపసపు.

దావః (పు) కాఱుచిచ్చు-అడవి- అగ్నిఁగుజ్జము. [బుట్టినది.

దావికః (త్రి) దేవకాయను నదియందుఁ

ద్రాక్ (అ) శీఘ్రముగా

ద్రాఘిష్ఠః (త్రి) మిక్కిలినిడుపైనది.

ద్రావిడకః (పు) చోరము

ద్యావాపృథివ్యౌ } (స్త్రీ) భూమ్యంతరిక్షములు.
ద్యావాభూమీ }

ద్వారమ్ (న) వాకిలి.

ద్వారస్థః } (పు) ద్వారపాలకుఁడు.
ద్వారపాలః }

దాశః (పు) వలచేతజీవించెడువాఁడు.

శాళపురమ్ (న) తుంగముస్తె - దేశము-పోలు

దాశార్హః (పు) విష్ణువు.

దాసః (పు) జాలరివాఁడు- సేవకుఁడు- శూద్రుఁడు- దాసశాఖా.

దాసీ (స్త్రీ) నల్లపెద్దగోరింటచెట్టు - కాకిదొండచెట్టు - పనిఁజేయునది కొన్నదాసి.

దాసేయః (పు) జీతగాడు
దాక్షాయణీ (స్త్రీ) పార్వతీదేవి - అశ్విని మొదలగునక్షత్రములు- పుడమి- రోహిణియనునక్షత్రము - దంతి చెట్టు
దాక్షిణ్యమ్ (న) ఇతరులంబనులనునెరవేర్చుశక్తి
ద్రాక్షా (స్త్రీ) ద్రాక్ష
దిక్ (స్త్రీ) దెస-పదియనుసంజ్ఞ
దిగమ్బరః (పు) బుద్ధదేవుఁడు - భైరవేశ్వరుఁడు-దిగంబరమతస్థుఁడు - చీకటి - శివుఁడు
ద్విగుణాకృతః (త్రి) రెండుసార్లుదున్నిన పొలము
ద్విజః (పు) బ్రాహ్మణుఁడు - క్షత్రియుఁడు-వైశ్యుఁడు-శరీరము- గణనాథుఁడు-జరాసంధుఁడు
ద్విజరాజః (పు) చంద్రుఁడు - గరుత్మంతుఁడు
ద్విజా (స్త్రీ) చిలుతేఁకుచెట్టు - రేణుకమనుగ్రంధ్యము
ద్విజాతిః (పు) బ్రహ్మక్షత్రియవైశ్యులు
ద్విజిహ్వాః (పు) పాము- కొండెగాఁడు
దితః (త్రి) కోయబడినది
దితిసుతః (పు) రాక్షసుఁడు - దితికొమరులు
ద్వితీయా(స్త్రీ)యజ్ఞాధికారిభార్య-విదియ
దిధిషుః } దిధిషూః } (పు) ౨-మార్లుపెండ్లైనదాని కిమగఁడు
దిధిషూః (స్త్రీ) మాఱుమనువుది.
దినమ్ (న) పగలు
దినమణిః (పు) సూర్యుఁడు.
దినాన్తః (పు) సాయంకాలము.
ద్విపః (ద్వ) ఏనుఁగు.
ద్విపాద్యః (పు) రెట్టిదండుగ.
ద్విరదః (పు) ఏనుఁగు
ద్విరసనః (పు) పాము
ద్విరేఫః (పు) తుమ్మెద - మృగము
దివమ్ (న) స్వర్గము- ఆకాసము- పగలు- వనము
దివసః (స్త్రీ) పగలు
దివస్పతిః (పు) దేవేంద్రుఁడు.
దివా (పు) దినము
దివాన్ధః (పు) గుడ్లగూబ
దివాకీర్తిః (పు) మంగలివాఁడు - మాలవాఁడు-సూర్యుఁడు - గుడ్లగూబ.
దివాభీతః (పు) గుడ్లగూబ-దొంగ-కలువ -అందుసరస్సు- ఏనుఁగునుఁదిసెదుమొసలి-ఒకానొకచేప
దివాకరః (పు) సూర్యుఁడు
దివిషత్ (పు) దేవతలు
దివ్యోపపాదుకః (త్రి) యోనిసంభవము లేనిదేవాదులు
దివౌకస్ (పు) దేవతలు
ద్వివర్షా(స్త్రీ) రెండుసంవత్సరములయావు
దిశా (స్త్రీ) దిక్కు
దిశ్యః (త్రి) దిక్కునందుఁబుట్టినది.
దిష్టమ్ (న) అదృష్టము - కొలత- సంతోషము,
దిష్టః (పు) కాలము-మానిపసవు.
ద్విషన్ (పు) శత్రువు
దిష్టాన్తః (పు) చావు
దిష్ట్యా (అ) సుఖముగా.
దిష్టిః (స్త్రీ) ఈవి-కొలత-సంతసము.

దుర్గా (స్త్రీ) పార్వతి - కాళికాదేవి.
దుర్గ (న) పట్టణము-పర్వతము మొదలగుచొరగూడనిప్రదేశములు - నరకము.
దురీ (స్త్రీ) పార్వతి.
దుర్జనః (త్రి) దుర్జనుఁడు.
దుర్ధరా (స్త్రీ) జ్యోతిష్మతిచెట్టు
దుర్నామకమ్ (న) మూలవ్యాధి
దుర్నామా (స్త్రీ) ఏనుఁగు-జెలగ.
దుర్బలః (త్రి) బక్కవాఁడు
దుర్ముఖః (పు) కానిమాటలుప్రేలేవాఁడు
దుర్వర్ణమ్ (న) వెండి.
దుర్విధః (త్రి) దరిద్రుఁడు.
ద్రుతః (త్రి) వగిలినది-కరఁగఁబడిన నెయ్యి మొదలయినది
ద్రువయమ్ (న) కుంచము, మానికమొదలైనది.
దుశ్చ్యవనః (పు) ఇంద్రుఁడు.
దుష్కృతమ్ (న) పాపము.
దుష్షమమ్ / దుష్షు (అ) అసవ్యము.
దుష్పత్రః (పు) బలురక్కసచెట్టు
దుష్ప్రధర్షః (పు) ఆణుదొండచెట్టు
దుస్పర్శః (పు) తీఁగెగ్రాసనుఁగుచెట్టు-పిన్నరేఁగటిదూలగొండిచెట్టు
దుస్పర్శా (స్త్రీ) ద్రావకుదుచెట్టు-అంతరవల్లి
దుహితా (స్త్రీ) కూతురు.
ద్యుః (అ) ఆకాశము.
ద్రుహిణః (పు) బ్రహ్మ - కుఱుచటెను పదుడ్డు
దూతః (పు) వర్తమానములు కొంచుఁబోవు దూత

దూతీ (స్త్రీ) దూతికా
దూత్యమ్ (న) వర్తమానములుకొంచుబోవుపని.
ద్యూతః (స్త్రీ) జూదము.
ద్యూతకారకః (త్రి) జూదమాడించువాఁ [డు
ద్యూతకృత్ (పు) జూదమాడువాఁడు
దూనః (త్రి) తపింపఁబడినది
దూరః (త్రి) దూరమునందున్నది.
దూరదర్శీ (త్రి) దీర్ఘదర్శి.
దూర్వా (స్త్రీ) గరికగడ్డి.
దూష్యమ్ (న) డేరా.
దూష్యా (స్త్రీ) ఏనుఁగనడుమునకుఁగట్టే తోలుపట్టె
దూషికా (స్త్రీ) కంటిపుసి- పాలెపురుగు
దృఢః (త్రి) దట్టనతరుచుగలది
దృఢసన్ధిః (త్రి) బలసినగట్టిశరీరము మొదలయినది
దృబ్ధః (త్రి) కూర్చబడిన పుష్పమాలికాదులు.
దృశా (స్త్రీ) నేత్రము
దృష్టరజాః (స్త్రీ) క్రొత్తగాసమర్తాడినపడుచు,
దృష్టాన్తః (పు) శాస్త్రము-దృష్టాంతము.
దృష్టిః (స్త్రీ) చూపు.
దేవః (పు) నాట్యోక్తిరాజు-దేవత.
దేవకః (పు) యదువంశపురాజు.
దేవకీనన్దనః (పు) విష్ణువు
దేవకుసుమమ్ (న) లవంగము.
దేవఖాతకమ్ (స్త్రీ) దేవతలచేత్రవ్వబడిన పుణ్యతీర్థము.
దేవఖాతమ్ (న) దేవతలచేత్రవ్వబడినది.

దేవజగ్ధకమ్ (న) కామంచిగడ్డి.
దేవతా (స్త్రీ) దేవత
దేవతాడః (పు) దేవతాడిచెట్టు
దేవతే (ధా) ఆ-శప్-దేవృదేవనే - దుః
ఖించుచున్నాఁడు
దేవదత్తః (పు) అర్జునశంఖము.
దేవదారుః(స్త్రీ) భద్రదారువృక్షము.
దేవద్ర్యఙ్ (త్రి)అంతటనడిచెడువాఁడు
దేవనమ్ (న) క్రీడ - విజిగీషావ్యవహార
ద్యుతిస్తుతిమోదమదస్వప్నము -
కాంతిగతులు - విలాపము -
జూదము.
దేవమాతృకః (త్రి) వర్షజలముచేఁబండు
పైరుగలదేశము
దేవరః (పు) మగనితోడఁబుట్టినవాఁడు
దేవభూయమ్ (న) దేవస్వరూపము - దే
వుఁడుకావడము
దేవలః (పు) తంబలవాఁడు-నంబివాఁడు
దేవవల్లభః (పు) సురపొన్న.
దేవాజీవః (పు) తంబలవాఁడు - నంబి
వాఁడు.
దేశః (పు) దేశము
దేశరూపమ్ (న) స్వధర్మమునుంచిచెలిం
చకయుండుట.
ద్రేకతే(ధా)ఆ-శప్-శబ్దించుచున్నాఁడు.
ద్వేషః (పు) శత్రుత్వము.
ద్వేషణః (పు) శత్రువు
ద్వేషీ (త్రి) శత్రువు.
దేహః (స్త్రీ) శరీరము.
దేహలీ (స్త్రీ) గడప.
దైతేయః (పు) రాక్షసజాతి.
దైత్యః (పు) రాక్షసుఁడు.

దైత్యగురుః (పు) శుక్రుఁడు.
దైత్యా (స్త్రీ) మురయనెడియోషధి-కల్లు
దైత్యారిః (పు) విష్ణువు.
ద్వైధమ్ (అ) రెండువిధములుగాను
ద్వైపః (పు) పులితోలుచేఁగప్పఁబడిన
రథము.
ద్వైమాతురః (పు) జరాసంధుఁడు- గణే
శుఁడు- వానుదేవుఁడు.
ద్రోణః (పు) చర్మాచ్ఛాదిత వాద్యవిశేష
ము-తుమ్మిచెట్టు - తేలు-ద్రోణా
చార్యుఁడు - బొంతుకాకి - వి
షము.
ద్రోణకాకః (పు) బొంతుకాకి
ద్రోణక్షీరా } (స్త్రీ) చాలాపాలిచ్చెడి
ద్రోణదుఘా } ఆవు
ద్రోణీ (స్త్రీ) కఱ్ఱలునీళ్లుమోసెడుపడవ-
నీలిచెట్టు - బీడు
ద్యోతః (పు) ఎండ
దోర్మృగ్యమ్ (న) గుద్దులాట - మోచేతి
మడుపు.
దోషఘ్నా (స్త్రీ) ఎఱ్ఱవసచెట్టు
దోషజ్ఞః (పు)విద్వాంసుఁడు-వైద్యుఁడు
దోషా (అ) రాత్రియందనునర్థము.
దోషైకదృక్ (త్రి) దోషమునేవెదకు
వాఁడు.
దోహజమ్ (న) పాలు.
దోహదమ్ (న) కోరిక.
దోహదవతీ (స్త్రీ) వేవిళ్లుఁగలయాఁడుది.
ద్రోహచింతనమ్ (న) ద్రోహముఁ దలఁ
చుట.
ద్రౌణికః (పు) నలుతుము విత్తులువిత్తె
డునేల.

## ధ

ధమ్ (అ) శిరస్సు.

ధః (పు) ధైవతస్వరస్థానము - ఇంద్రుఁడు-ధ్వని-ధ్యానము - కుబేరుఁడు-ధన్వంతరి - కడవ.

ధ్రణతి (ధా) ప - శప్ - ధ్రణశబ్దార్థే-ధ్వనిచేయుచున్నాఁడు

ధ్రజతి } (ధా) ప- శప్-ధ్రజగతౌ-
ధ్రంజతి } పోవుచున్నాఁడు.

ధ్వజతి (ధా) ప-శప్- ధ్వజగతౌ - పోవుచున్నాఁడు

ధ్వంజతి (ధా) ప-శప్ - ధ్వంజిగతౌ-పోవుచున్నాఁడు

ధ్వజః (స్త్రీ) జెండా

ధ్వజినీ (స్త్రీ) మడమ- సమూహము.

ధణతి(ధా) ప-శప్-ధణశబ్దార్థే-ధ్వనిచేయుచున్నాఁడు.

ధనమ్ (న) ధనియాలు - లెక్క-కలియఁగూడడము.

ధనఞ్జయః (పు) అగ్ని-శరీరమందలియొకవాయువు - మద్దిచెట్టు.

ధనదః (పు) కుబేరుఁడు.

ధనహారి(పు)క్లైచెట్టు-చండయనుగ్రంధ్య [ము

ధనాధిపః (పు) కుబేరుఁడు

ధనికః (త్రి) ధనముఁగలవాఁడు.

ధనిష్ఠా (స్త్రీ) నక్షత్రవిశేషము.

ధనుః (స్త్రీ) విల్లు

ధనుర్ధరః (పు) విలుకాఁడు.

ధనుశ్శ్రేణీ (స్త్రీ) చాగచెట్టు.

ధనుష్మాన్ (పు) విలుకాఁడు.

ధన్యః (త్రి) పుణ్యాత్ముఁడు.

ధన్వ (న) విల్లు.

ధన్వయాసః (పు)పిన్నతెగడదూలగొండి [చెట్టు.

ధన్వీ (త్రి) విలుకాఁడు.

ధ్వనిః (పు) రవము

ధ్వనితః (త్రి) మ్రోయువస్తువు.

ధమనః (పు) కిణపదంటు

ధమనిః (స్త్రీ) నాడి.

ధమనీ (స్త్రీ) గువ్వగుత్తిగడ్డి-బోలునరము

ధమ్మిల్లః (పు) ముడివేసినవెంట్రుకలు.

ధరః (పు) కొండ

ధరణిః } (స్త్రీ) భూమి.
ధరణీ }

ధర్జతి (ధా) అ-శప్ - ధృజగతౌ-పోవుచున్నాఁడు.

ధర్మః (పు) పుణ్యము-యముఁడు-నీతి-స్వభావము-ఆచారము - సోమయాజి-యజ్ఞము

ధర్మచిన్తా (స్త్రీ)ధర్మచింత [డు.

ధర్మధ్వజీ (త్రి)నట్టివేషమున బ్రతుకువాఁడు.

ధర్మరాజః(పు)బుద్ధదేవుఁడు-యముఁడు.

ధర్మసంహితా (స్త్రీ) ధర్మశాస్త్రము

ధర్షణీ (స్త్రీ) రంకులాడి [పు.

ధవః (పు) నారంజిచెట్టు-మగఁడు-తెలు

ధవళః (త్రి) తెలుపు

ధవిత్రమ్ (న) యజ్ఞాగ్నినివిసిరెడికొఱకు యిఱ్ఱితోలుతోఁజేసిన విసెనకఱ్ఱ.

ధ్వనిః (పు) మోత.

ధ్వస్తః (త్రి) జారినది.

ధా (స్త్రీ) బుద్ధి

ధాః (పు) బ్రహ్మ-బృహస్పతి.

ధాకః (పు) ఆహారము

ధాటిః } (స్త్రీ) ముట్టడివేయడము
ధాటీ }

ధాతకీ (స్త్రీ) ఆరెవువ్వు.
ధ్వాంతమ్ (న) చీకటి.
ధాతా { (పు) బ్రహ్మ,
　　　{ (త్రి) ధరించువాఁడు.
ధాతుః (పు) మనశ్శిలాదిగిరిధాతువు-శ్లే
　　ష్మాదినాడి-పంచతన్మాత్రలు - పం
　　చేంద్రియములు.
ధాతుపుష్పికా (స్త్రీ) ఆరెవువ్వు.
ధాతృః (పు) బ్రహ్మ
ధాత్రీ (స్త్రీ) భూమి-ఉసిరికచెట్టు- పెంపు
　　డుతల్లి-తల్లి.
ధాన్యమ్ (న) ధాన్యము
ధానా (స్త్రీ) చెట్టువిత్తనము- ధనియాలు.
ధాన్యాకమ్ (న) ధనియాలు
ధాన్యామ్లమ్ (న) కలికడుగునీళ్లు.
ధ్వానః (పు) రవము
ధానుష్కః (త్రి) విలుకాఁడు
ధామ (న) గృహము-దేహము- కాంతి-
　　ప్రభావము
ధామనిధిః (పు) సూర్యుఁడు
ధామార్గవః } (పు) ఉత్తరేణిచెట్టు-దే
ధామార్జనః } 　వదారుచెట్టు.
ధ్యామమ్ (న) కామంచిగడ్డి.
ధాయ్యా (స్త్రీ) అగ్నిని మొదటప్రజ్వలిం
　　పఁజేయువేదమంత్రము.
ధారణా (స్త్రీ) మర్యాద
ధారా (స్త్రీ) కత్తివాటి-అంచు-కాలేధార
ధారాధరః (పు) మేఘము- ఖడ్గము
ధారాసమ్పాతః (పు) జడివాన.
ధార్తరాష్ట్రః (పు) దుర్యోధనుఁడు-నల్ల
　　నిముక్కు-కాళ్లుగల తెల్లహంస
ధార్ష్ణపత్తనమ్ (న) మిరియాలు.

ధావనీ (స్త్రీ) నక్కతోకగడ్డి-నక్కతోక
ధ్యాయమ్ (న) కామంచిగడ్డి
ధ్వాఙ్క్షః (పు) కాకి-కొంగ.
ధిక్ (అ) ఆదరించుట-నింద.
ధిక్కృతః (త్రి) వెలివేయఁబడినవాఁడు-
　　నిందింపబడినవాఁడు.
ధిషణః (పు) బృహస్పతి-సూర్యుఁడు-చం
ధిషణా (స్త్రీ) బుద్ధి.　　　[ద్రుఁడు.
ధిష్ణ్యమ్(న) తావు-ఇల్లు-నక్షత్రము-అగ్ని
ధీ (స్త్రీ) బుద్ధి
ధీమతీ (స్త్రీ) ఎక్కువబుద్ధిగల స్త్రీ.
ధీమాన్ (పు) విద్వాంసుఁడు.
ధీరమ్ (న) కుంకుమపువ్వు.
ధీరః (పు) విద్వాంసుఁడు.
ధీవరః (పు) జాలరివాఁడు-సముద్రము.
ధీసచివః (పు) మంత్రి.
ధుతః (త్రి) కదిలించఁబడినది- విడువఁబ
　　డినది.
ధుత్తూరః (పు) ఉమ్మెత్తచెట్టు.
ధునీ (స్త్రీ) నది
ధురన్ధరః } (పు) బరువుమోయుజంతు
ధురీణః } 　వు
ధుర్యః (త్రి) బరువుమోసెడుజంతువు.
ధువిత్రమ్ (న) యజ్ఞాగ్ని విసిరెడికొరకుని
　　త్తితోలుతోచేసినవిసనకఱ్ఱ.
ధుర్వః (పు) మోదు-వట్టిచెట్టు-గనికె.
ధుర్వా (స్త్రీ) స్రుక్కుయొక్కభేదము.
ధుస్తూరః (పు) ఉమ్మెత్తచెట్టు
ధూతః (త్రి) విడువఁబడినది- కదిలించఁబ
　　డినది-బెదిరించఁబడినవాఁడు.
ధూపాయతి (ధా) ప- శప్-ధూపసంతా
　　పే- తపించుచున్నాఁడు.

ధూపాయితః (త్రి) తపించఁబడినది

ధూపితః (త్రి) కర్పూరాదికముచేతవా
సించినవస్తువు.

ధూమకేతుః (పు) అగ్ని-ఉత్పాతము

ధూమయోనిః (పు) మేఘము

ధూమలః (త్రి) నలుపుయెరుపుగలరంగు

ధూమ్యా (స్త్రీ) ధూమసమూహము

ధూమ్యాటః (పు) కూఁకటిమూగపిట్ట

ధూమ్రః (త్రి) నలుపుయెఱుపుగలరంగు.

ధూర్జటి
ధూర్జటీ } (పు) శివుఁడు

ధూర్తః (పు) ఉమ్మెత్తచెట్టు- గారడివాఁ
డు- జూదగాఁడు

ధూర్వహః (పు) బండి, నాగలి, కంట్లము
మొదలగుబరువుమోసెడుజంతువు

ధూసరః (త్రి) ఇంచుకతెలుపు

ధూళీ (స్త్రీ) పరాగము.

ధృంజతి (ధా) ప-శప్-ధ్వజిగతౌ-పోవు
చున్నాఁడు

ధృతిః (స్త్రీ) ధరించుట-ధైర్యము.

ధృవా (స్త్రీ) ముయ్యాకుపొన్న

ధృష్టః
ధృష్ణుః } (త్రి) దిట్టతనముగలవాఁడు.

ధేనుః (స్త్రీ) లేఁగటియావు

ధేనుకా (స్త్రీ) ఆడఏనుఁగ- ఆవు

ధేనుష్యా (స్త్రీ) తాకట్టుపెట్టినయావు-కట్టి
మేపెడియావు. [ము

ధైనుకమ్ (న) లేఁగటియావులసమూహ

ధైవతః (పు) సప్తస్వరములలోనొకటి

ధోతరికమ్ (న) చతురమైననడుపు

ధోరణమ్ (న) సకలవాహనములు.

ధోరితమ్ (న) అశ్వగతివిశేషము.

ధౌరేయః (పు) బరువుమోసెడుజంతువు

## న

న (అ) లేదు-కాదు-ఒద్దు.

నః (పు) వినాయకుఁడు.

నః (త్రి) గొడ్రాలు-సూక్ష్మమైనది - మి
క్కిలికష్టమైనది-అభావమైనది-భే
దమైనది

నకులః (పు) ముంగిస-నకులుఁడు.

నకులేష్టా (స్త్రీ) సర్పాక్షిచెట్టు

నక్కుటకమ్ (న) ముక్కు.

నక్తమ్ (అ) రాత్రియందు [గుడ్డ

నక్తకః (పు) నల్లగుడ్లగూబ- మాసినచిన్న

నక్తంచరః (పు) గుగ్గిలపుచెట్టు- గుడ్లగూబ

నక్తమారః
నక్తమాలః } (పు) కానుఁగుచెట్టు.

నక్రః (పు) కాలుమొసలి.

నక్రా (స్త్రీ) తేలుమణిచెట్టు

నక్షత్రకణ్టికే (స్త్రీ) అనాసచెట్టు.

నక్షత్రాకృతిః (పు) తెల్లజొన్నలు,

నఖమ్ (న) నఖముచిప్ప- వ్యాఘ్రనఖము
నుగంధ్యము.

నఖః (స్త్రీ) గోళ్లు.

నఖః (పు) నపుంసకుఁడు.

నఖతి (ధా) ప- శప్-నడుచుచున్నాఁడు.

నఖరః (పు) గోరు

నగః (పు) కొండ-చెట్టు-సర్పము-నాళ్వి.

నగరీ (పు) పట్టణము.

నగౌకాః (పు) పిట్ట

నగ్నః (త్రి) దిస్సమొలవాఁడు.

నగ్నహూః (న)
నగ్నహూః (పు) } నానా ద్రవ్యకృత
సురాబీజము.

న్యగ్రోధః (పు) మఱ్ఱిచెట్టు-శార-జమ్మిచె
ట్టు-పాఁజనిదండు-ఊడ.

న్యగ్రోధీ (స్త్రీ) మఱ్ఱిచెట్టు- ఎలుకచెవిచెట్టు-విషపర్ణి చెట్టు - మోహనయసుయోషధము.

న్యక్ (త్రి) పొట్టివాఁడు.

న్యఙ్కుః (పు) పిల్ల-వండడము- పండడము-ఓఁకచెట్టు-జింకపోతు.

నటః (పు) అభినయవేత్త- దుందిలపుచెట్టు- వేషముకట్టిజీవించువాఁడు-నాట్యముఁజేసేది

నటతి (ధా) ప-శప్-నటనృత్తౌ - నాట్యముఁజేయుచున్నాఁడు.

నటనమ్ (న) నాట్యము.

నటీ (స్త్రీ) కాకిదొండ-గువ్వగుత్తిగడ్డి.

నడః (పు) అంబాలపుచెట్టు-కిక్కసగడ్డి.

నడ్యా (స్త్రీ) కిక్కసగడ్డిసమూహము.

నడ్వలః<br>నడ్వాన్ } (త్రి) కనపగడ్డిగలదేశము

నతమ్ (న) గ్రంధితగరము.

నతః (త్రి) వంగినది.

నతనాసికః (పు) చప్పముక్కుగలవాఁడు.

నదీ (స్త్రీ) ఏఱు-యోజనముకంటె దూరముగాఁబ్రవహించెడి కొండయొక్క కాలువ.

నదీమాతృకః (త్రి) ఏటినీటివలనఁబండెడుసస్యమువలనపరిపాలించబడుదేశము.

నధ్రీ (స్త్రీ) తోలువారు.

ననన్దా<br>ననాన్ధా } (స్త్రీ) ఆఁడుబిడ్డ.

నను (అ) ఓయి-అడుగుట- నిశ్చయము-సమ్మతి-ఆజ్ఞ-ఊరడించుట - వి॰ము-బదులుమాట-ఇచ్ఛ-పరమత. తిరస్కారణము-అనాదిప్రవాదము.

ననుచ (అ) ఉన్నదానినివిరోధముగాఁజెప్పడము-అడుగుట,

నన్దకః (పు) విష్ణుఖడ్గము

నన్దతి (ధా) ప-శప్-సమృద్ధిగానుంచుచున్నాఁడు

నన్దనమ్ (న) ఇంద్రునివనము.

నన్దివృక్షః (పు) నందివృక్షము-నందిచెట్టు

నన్ద్యావర్తః (పు) నందివర్ధనపుచెట్టు.

నపుంసకః (పు) నపుంసకుఁడు- మగతనములేనివాఁడు

నప్తా (పు) కొడుకుకొడుకు-కూతురుకొడుకు.

నప్త్రీ (స్త్రీ) కుమారునికొమార్తె-కూఁతురుకొమార్తె

నభమ్ (న) ఆకాశము-మేఘము.

నభః (పు) శ్రావణమాసము.

నభస్యః (పు) భాద్రపదమాసము.

నభస్వాన్ (పు) వాయువు.

నమః (అ) నమస్కారము.

నమసితః (త్రి) పూజింపఁబడినవాఁడు.

నముచిసూదనః (పు) ఇంద్రుఁడు.

నయః (పు) పొందించడము.

నయతే (ధా) ఆ-శప్-నయగతౌ - వెళ్లుచున్నాఁడు.

నయనమ్ (న) కన్ను.

నరః (పు) మనుష్యుఁడు-బ్రహ్మ-అర్జునుఁడు

నరకః (పు) నరకాసురుఁడు.

నరవాహనః (పు) కుబేరుఁడు

నర్తకీ (స్త్రీ) నాట్యమాడెడుస్త్రీ.

నర్తనమ్ (న) నాట్యము

నర్మస్ఫూర్జః (పు) స్త్రీపురుషపరిహాసము.
నర్దతి (భా) ప-శప్-ధ్వనిచేయుచున్నాడు
నలకూబరః (పు) కుబేరునికొడుకు.
నలదమ్ (న) తెల్లవట్టివేళ్లు.
నలమీనః (పు) కసువులోతిరిగెడుచేప.
నలినమ్ (న) తామరపువ్వు.
నలినీ (స్త్రీ) తామరతీగె.
నలీ (స్త్రీ) గువ్వగుత్తిగడ్డి-మణిశిల.
నల్వః (పు) నాలుబారలదూరము.
నవః (పు) పొగడుట-ఎఱ్ఱగలిజేరు.
నవదలమ్ (న) లేతరేకు.
నవనీతమ్ (న) వెన్న.
నవమాలికా (స్త్రీ) విరజాజి.
నవసూతికా (స్త్రీ) అప్పుడుయీనిన ఆవు
నవాహః (పు) క్రొత్తదినము-పాడ్యమి
నవీనః (త్రి) క్రొత్తది.
నవై (అ) ఏమిచెప్పవలె.
నవోద్ధృతమ్ (న) వెన్న
నవ్యః (త్రి) క్రొత్తది
నష్టః (త్రి) ఓడిపోయిదాగినవాఁడు.
నష్టాగ్నిః (పు) ఉత్సర్గేష్టిఁజేసి గార్హపత్యాగ్నివిడిచినవాఁడు.
నస్తితః }
నస్యోతః } (పు) ముక్కుకుట్టినయెద్దు
నహి (అ) లేదు-కాదు.
న్యస్తః (త్రి) దాఁచుకొన్నది.
నక్షత్రమ్ (న) చుక్క.
నక్షత్రమాలా (స్త్రీ) ఇఱువదేడుముత్తెములనుఁగ్రుచ్చినహారము- చుక్కల
నక్షత్రేశః (పు) చంద్రుఁడు [వరుస.
న్యక్షః (పు) దున్నపోతు-పరశురాముఁడు
నా (అ) లేదు-కాదు

నా (పు) మగవాఁడు-గంగ్రడిగొడ్డలి- శంకరుఁడు.
నాకః (పు) స్వర్గము-ఆకాశము.
నాకుః (పు) పుట్ట-పర్వతము-ముని.
నాకులీ (స్త్రీ) సర్పాక్షిచెట్టు.
నాగమ్ (న) తగరము-సీసము.
నాగః (పు) నెగడు-పొన్నచెట్టు-నారంజిచెట్టు-ద్వారబంధపునిడుపుకమ్మి.
నాగకేసరః (పు) కేసరవృక్షము.
నాగజిహ్వికా (స్త్రీ) మణిశిల.
నాగబలా (స్త్రీ) బీరచెట్టు.
నాగరః (పు) నేర్పరి-పట్టణమందుఁబుట్టినవాఁడు
నాగరఙ్గః (పు) నారంజిచెట్టు.
నాగలోకః (పు) పాతాళము.
నాగవల్లీ (స్త్రీ) తమలపాకుతీగె.
నాగసమ్భవమ్ (న) సిందూరము.
నాగసుగన్ధా (స్త్రీ) సర్పాక్షిచెట్టు.
నాగాన్తకః (పు) గరుడుఁడు-ఇంద్రుఁడు
నాట్యమ్ (న) నాట్యము-నృత్తగీతవాద్య
నాటింధమః (పు) కంసాలివాఁడు [ము
నాడీ (స్త్రీ) గడియ-బోలునరము-గొట్టము.
నాడీవ్రణః (పు) శెలవేసినకురుపు.
నాదః (పు) ధ్వని [డు
నాధతి (భా) ప-శప్-యాచించుచున్నా
నాధతే (భా) ఆ-శప్- ఆశీర్వాదముఁజే.
యుచున్నాఁడు.
న్యాదః (పు) భోజనము
నానా (అ) గాకయనుట [స్తువు.
నానారూపః (త్రి) పెక్కువిధములైనవ
నాస్తికరః (పు) }
నాస్తీవాది (త్రి) } మంగళపాఠకుఁడు.

నాపితః (పు) మంగలవాఁడు.
నాభిః (ద్వి) కస్తూరి-బొడ్డు
నాభికః (పు) గారె.
నాభివర్ధ్నః (త్రి) బొడ్డులోతు.
నామ (అ) కోపము-ఓయి-అంగీకారము
నామధేయమ్ (న) పేరు
నాయః (పు) పొందించడము.
నాయకః (పు) సేనాపతి-స్వామి,
నారః (పు) లేఁగదూడ-మనుజులు-నీళ్లు
నారకః (పు) నరకము-నరకమునందుం
డెడుజంతువు
నారాచః (పు) గంటము-ఉపబాణము.
నారాచీ (స్త్రీ) త్రాసు-శాణము.
నారాయణః (పు) విష్ణువు- అశ్వత్థవృక్ష
ము-శివుఁడు-మత్స్యము-బ్రహ్మ -
చంద్రుఁడు- సముద్రము- సూ
ర్యుఁడు-వెలగచెట్టు-జామిచెట్టు
నారాయణీ (స్త్రీ) పార్వతి - వెన్నెల-స
రస్వతి-గంగ-పిల్లిపీచర
నారికేళః (పు) టెంకాయచెట్టు [తి.
నారీ(స్త్రీ) ఆఁడుది-వింటినారి-మనుష్యజా
నాలమ్ (న)గడ్డిమొదలయినవాటికాడ-
కంసాలియూదుగొట్టము-బిలము
నాలః (త్రి) కాడ.
నాలికమ్ (న) కమలము.
నాలికః (పు) టెంకాయగరిగె.
నాలికా (స్త్రీ) గొట్టము - పాయిసందు-
రంధ్రము - వెదురుగొట్టము
నావికః (పు) ఓడదాటించువాఁడు.
నావ్యః (త్రి) పడవచేతదాటఁదగినది
న్యాయః (పు) తగవు- చెడనిధర్మము
నాశః (పు) మరణము - తిరోధానము

నాసత్యః (పు) దేవవైద్యుఁడు.
నాసా (స్త్రీ) పూజించేద్వారబంధపుకమ్మి-
నాసికా (స్త్రీ)ముక్కు. [ముక్కు.
నాస్తికతా (స్త్రీ) పరలోకములేదనుట
నాళః (పు) కాడ.
నాళా (స్త్రీ) కాడ.
నాళికేరః (పు) టెంకాయచెట్టు.
నాళీ (స్త్రీ) గడ్డిపూచ.
ని (అ) నిశ్చయము-నిషేధము- సంశయ
యము-సామీప్యము.
నికటమ్ (న) సమీపము.
నికరః (పు) గుంపు [మి
నికర్షణమ్(న) పట్టణాదిపశ్చిమభాగభూ.
నికషః (పు)బంగారమొఱసెడిరాయి.
నికషా (అ) దగ్గెర
నికషాత్మజః (పు) నైరృతి
నికామమ్ (న) యథేష్టమైనది.
నికాయః (పు) ఇల్లు - ఒక్కవిధమైనన
డకగలవారిగుంపు.
నికాయ్యః (పు) ఇల్లు.
నికారః(పు)పండ్లుకొఱకడముమొదలైన
వి-తూర్పెత్తెటంచుకు పైకెఁజిమ్మ
నికారణమ్ (న) చంపడము. [డము.
నికుఞ్చకః (పు) సోలెడు
నికుఞ్జః (స్త్రీ) పొదరిల్లు
నికుమ్భః (పు) కుంభకర్ణునికొమారుఁడు-
నాగదంతివృక్షము.
నికురమ్బమ్ (న) గుంపు
నిక్షతః(త్రి)రాజుచేత సేవగించఁబడినవాఁ
డు-వంచనచేయఁబడినవాఁడు-అ
[ల్పుఁడు
నిక్షృతిః (స్త్రీ)కపటోషడము

నిష్కృష్టః (త్రి) ఆచారాదినిందితుఁడు.
నిశేతనమ్ (న) ఇల్లు.
నికోచకః (పు) ఊడుగుచెట్టు.
నిక్వాణః
నిక్కాణః } (పు) వీణాదిధ్వని.
నిఖిలః (త్రి) సమస్తము.
నిగడః (పీ) ఏనుఁగగొలుసు.
నిగదః (పు) తెలియచెప్పుట. [ము.
నిగమః (పు)పట్టణము-అంగడి-వీధి-వేద
నిగలః (పీ)ఏనుఁగుకాళ్లకు వేయుసంకె
నిగాదః(పు) తెలియచెప్పుట. [ళ్లు
నిగారః (పు) మ్రింగడము-తినడము.
నిగాలః(పు)గుఱ్ఱపుగొందలక్రింద-కంఠము
నిగ్రహః(పు)ఒద్దనికాకుండాచేయడము-
బెదిరించడము.
నిఘః (పు) జగడము - అంతటాసమము
గుఅరుగురాశిపొందరైనది.
నిఘసః (పు) భోజనము.
నిఘ్నః (త్రి) పరాధీనుఁడు - గుణకార
ముతెలసినవాఁడు.
నిచులః (పు) ప్రబ్బచెట్టు-నీటిగన్నేరు-
గవిసెన- పక్కదుప్పటి
నిచోలః(పు) గవిసెన - పక్కదుప్పటి
నిజః (త్రి) స్వకీయమైనది - నిత్యము
నిట్ (సీ) రాత్రి
నిటలమ్ (న) నుదురు.
నితమ్బః (పు( శిఖరము - పిఱుదు.
నితమ్బినీ (సీ) పెద్దపిఱుదులుఁగల స్త్రీ)
నితరామ్ (అ) నుతరామ్-మిక్కిలి.
నితాన్తమ్ (న) అతిశయము.
నిత్యః (త్రి) నాశనము లేకయుండునది
నిదాఘః (పు) చెమట - ఎండ.

నిదానమ్ (న) ఆదికారణము- రోగనిర్ణ
యము-కారణము.
నిదిగ్ధః (త్రి) అలకడముచేతపెతిగినగోడ
నిదిగ్ధికా (సీ) తెలగ-వాకుఁడుచెట్టు.
నిదేశః (పు) ఆజ్ఞ.
నిద్రా (సీ) నిద్ర.
నిద్రాణః (పు) నిద్రఁబోయినవాఁడు.
నిద్రాలుః (త్రి) నిద్దురబోతు,
నిధనః (సీ) చావు - కులము,
నిధానమ్ (న) దాఁచుకొనినసొమ్ము-పాఁ
తిపెట్టినసొమ్ము.
నిధిః (పు) నిధి - ఆధారము.
నిధువనమ్ (న) రతి.
నిధ్యానమ్ (న) చూచుట.
నిన్దతి(ధా) ప-శప్-నిందించుచున్నాఁడు
నినదః
నినాదః } (పు) ధ్వని,
నిపః (సీ) కడవ - కదంబవృక్షము.
నిపతః
నిపాతః } (పు) చదవడము.
నిపాతనమ్ (న)క్రిందికిపడద్రొయ్యడము.
నిపానమ్ (న) నూతివద్దిగాడి.
నిపుణః (పు) నేర్పరి
నిబన్ధః (పు) మలమూత్రబంధరోగము.
నిబన్ధనః (త్రి) కూర్చఁబడినది
నిబర్హణమ్ (న) చంపడము.
నిభః (త్రి) ప్రకాశము.
నిభృతః (త్రి) శిక్షింపబడినవాఁడు.
నిమయః (పు) సాటాకోటి
నిమిత్తమ్ (న) కారణము-చిహ్నము.
నిమిషః (పు) లఘువైన యక్షరము
చ్చరించునంతకాలము - రెప్ప

పాటువేసినంతకాలము-కనుఱె
ప్పవ్రాల్పడము

నిమీలనమ్ (న) చావడము - కన్నులు
మూయడము

నిమేషః(పు)లఘువైనయక్షరమునుచ్చరిం
చునంతకాలము-ఱెప్పపాటువ్రే
సినంతకాలము-కనుఱెప్పవ్రాల్ప

నియతిః (స్త్రీ) భాగ్యము [డము

నియన్తా (పు) రథసారథి.

నియమః (పు) అంగీకారము - శౌచతప
స్సులుమొదలైనకర్మము - యో
గాంగమము.

నియాతనమ్ (న) క్రిందికిఁబడద్రొయ్యడ

నియామకః(పు) తండేలు [ము

నియుద్ధమ్ (న) జెట్టీపోట్లాట.

నియోజ్యః (త్రి) జీతగాఁడు.

నిరఙ్కుశః (త్రి) అడ్డములేనిది.

నిరన్తరః (త్రి)దట్టన-తఱుచుఁగలది.

నిరయః (పు) నరకము.

నిరర్గలమ్ (న) అడ్డములేనిది.

నిరర్థకః (త్రి) వ్యర్థమయినది.

నిరవగ్రహః (పు) స్వతంత్రుఁడు.

నిరసనమ్ (న) కాదనడము.

నిరస్తః (త్రి) త్వరతోఁబలికెడుమాట-
వేయంబడినబాణము - రెండవ
తగవునకువచ్చినవాఁడు.

నిరాకరిష్ణుః (త్రి) నిరాకరించు నైజము
గలవాఁడు.

నిరాకృతః (త్రి) న్యాయముచేతంబరిహ
రింపబడినవాఁడు.

నిరాకృతిః (పు) వేదముమఱచినవాఁడు.
(స్త్రీ) కాదనడము.

నిరామయః (త్రి) రోగముతీరినవాఁడు

నిర్ఋతిః (స్త్రీ) అభాగ్యము

నిర్గుణ్డీ (స్త్రీ)వావిలిచెట్టు-నల్లవావిలిచెట్టు

నిర్గ్రన్థనమ్ (న) చంపడము

నిర్ఘోషః (పు) శబ్దము.

నిర్జరః (పు) దేవతలు.

నిర్ఝరః (పు) సెలయేఱు.

నిర్ణయః (పు) నిశ్చయము

నిర్ణిక్తమ్ (త్రి) అకల్మషముగాశోధించఁబడ

నిర్ణేజకః (పు) చాకలివాఁడు. [ము.

నిర్దేశః (పు) ఆజ్ఞ

నిర్ధార్యమ్ (త్రి) ఆపత్సంపదలయందుధై
ర్యముగాఁగార్యముచేయువాఁడు

నిర్భరమ్ (న) అతిశయము

నిర్మదః (పు) మదముడిగినఏనుఁగు.

నిర్ముక్తః (పు) పొరవిడిచినపాము - సం
సారమునువిడిచినవాఁడు.

నిర్మోకః (పు) పొర. [ము.

నిర్యాణమ్(న)ఏనుఁగుకడకన్ను - మరణ

నిర్యాతనమ్ (న) పగతీర్చుకొనడము -
దానము - దాచపెట్టినదితిరుగా
నిచ్చుట - అప్పుతీర్చుట.

నిర్యామః (పు) ఓడగంబముమీఁదినుండి
యుపాయముఁజెప్పెడివాఁడు -
ఓడతండేలు.

నిర్వ్యూహః (పు) వాకిలి-సిగనుచుట్టినపూ
లదండ - కషాయము-చిలుకకొ
య్య - రసము.

నిర్వపణమ్ (న) ఇవ్వడము.

నిర్వర్ణనమ్ (న) చూచుట.

నిర్వహణమ్ (న) నాట్యకథాంతము.

నిర్వాణమ్(న)ముక్తి-ఏనుఁగనుకడగడము

నిర్వాతః (పు) గాలితేకపోవడము.
నిర్వాదః(పు) నింద- నిశ్చితమయినవాద [ము.
నిర్వాపణమ్ (న) చంపడము.
నిర్వాసనమ్ (న) చంపడము- వెళ్లగొట్టడ [ము.
నిర్వృత్తః (త్రి) సిద్ధమైనది
నిర్వేశః (పు) జీతము-కూలి.
నిర్వ్యథనమ్ (న) రంధ్రము.
నిర్హ్రాదః (పు) ధ్వని
నిర్హారః (పు) ఒంటనాటినబాణములను
బెరకడము.
నిర్హారీ (త్రి) కర్పూరాదికము.
నిలయః (పు) ఇల్లు.
నివహః (పు) గుంపు. [ము
నివాకః(పు)ఎక్కువతక్కువలేక పలకడ
నివాతః (పు) గాలితేనిచోటు.
నివాపః (స్త్రీ) పితృలకొరకైనదానము
నివీతః (త్రి) కప్పుకొనెడిబట్ట - పేరుగా
వేసికొనినజంద్యము
నివృతః (త్రి) చుట్టుకొనఁబడినది
నివేశః (పు) దండువిడిచినస్థలము - ఉం
చడము.
నిశా (స్త్రీ) రాతిరి- పసపు-మ్రానిపసపు
నిశాఖ్యా (స్త్రీ) పసపు.
నిశాన్తమ్ (న) ఇల్లు.
నిశాన్తః (పు) ప్రాతఃకాలము.
నిశాపతిః (పు) చంద్రుఁడు.
నిశారః (పు) సర్వాంగపావడ- గాలిని
మంచునుగొట్టుకచ్చడము.
నిశితః (త్రి) వాడిగాచేయఁబడినది.
నిశీథః (పు) అర్ధరాత్రి.
నిశీథినీ (స్త్రీ) రాత్రి.
నిశ్చయః (పు) నిజము.
నిశ్శ్రేయసమ్ (న) మోక్షము-కల్యాణము
నిశ్శలాకః (త్రి) రహస్యస్థలము.
నిశ్శేషః (త్రి) సమస్తము.
నిశ్శోధ్యః (త్రి) అకల్మషముగాశోధించ
బడినది
నిశ్శ్రేణిః (స్త్రీ) నిచ్చెన- పేరీతచెట్టు
నిషఙ్గః (పు) అంబులపొది-చేరిక.
నిషఙ్గీ (పు) విలుకాఁడు.
నిషద్యా (స్త్రీ) అంగడి
నిషధః (పు) నిషధపర్వతము.
నిషద్వరః (పు) బురద
నిషాదః (పు) సప్తస్వరములలోనొకటి-
బ్రాహ్మణపురుషునికిశూద్రస్త్రీకిఁ
బుట్టినవాఁడు-చండాలుఁడు.
నిషాదీ (పు) మావటివాఁడు.
నిషూదనమ్ (న) చంపడము.
నిష్కః (పు) రత్నస్థాపితమయినపదకపు
బిళ్ల-ముద్రిక.
నిష్కలా (స్త్రీ) ముట్టుడిగినయాఁడుది.
నిష్కాసితః (త్రి) వెళ్లకొట్టఁబడినవాఁడు.
నిష్కుటః (పు) ఇంటిచేరువతోట - త
లుపు-మడి.
నిష్కుటిః (స్త్రీ) పెద్దయేలకులు.
నిష్కుషః } (పు) తొఱ్ఱ.
నిష్కుహః }
నిష్క్రమః (పు) బుద్ధి-బలము- బయలు
వెడలుట-చెడుకులము
నిష్ఠా (స్త్రీ) నాట్యమందలియయిదవ సం
ధి-నాశము-కార్యమగుట-తుద-
తాత్పర్యము-యాచించుట-నిర్వ
హించుట-నెరవేర్చుట.
నిష్ఠానమ్ (న) మజ్జిగ-పిండివంట.

నిష్ఠీవనమ్ (న) ఉమియడము.
నిష్ఠురః (త్రి) కఠినవాక్కు- కఠినమైనది
నిష్ఠ్యూతః (త్రి) త్రోయఁబడినది- వెళ్లఁగ క్రక్కఁబడినది.
నిష్ఠ్యూతిః (స్త్రీ) ఉమియడము.
నిష్ణాతః (త్రి) నేర్పరి.
నిష్పక్వః (త్రి) అగ్నిచేతమఱిగినది-కషాయాదికము
నిష్పన్నః (త్రి) సిద్ధమయినది.
నిష్పావః (పు) అనపచెట్టు - అనుములు- ధాన్యమునుదూర్పెత్తడము.
నిష్ప్రవాణిః (త్రి) క్రొత్తబట్ట.
నిష్షమమ్ (అ) అలస్యముగాను. [ము
నిసర్గః(పు)స్వభావము-నిర్మితము-త్యాగ
నిసృష్టః (త్రి) దాఁచబడినది - మరుగుపఱచబడినది
నిస్తర్హణమ్ (న) చంపడము
నిస్తలమ్ (త్రి) గుండ్రనిది (న) నీళ్లు
నిస్త్రింశః (పు) ముప్పదియంగుళములకెక్కువైనకత్తి- చేప.
నిస్రమ్ (న) కళ్ళి
నిస్రావః (పు) గంజిమీఁదిమీగడ
నిస్వః (త్రి) దరిద్రుఁడు
నిస్వనః / నిస్వానః } (పు) ధ్వని
నిస్సరణమ్ (న) ఊరిముందటిభూమి
నిహననమ్ (న) చంపడము
నిహాకా (స్త్రీ) నీరుడుము- ఉడుము
నిహింసనమ్ (న) చంపడము
నిహీనః (త్రి) అల్పుఁడు
నిహ్నవం (పు) కప్పడము- దాఁచడము- నిరాకరణము

నీకాయ్యః (పు) ఇలు.
నీకాశః (త్రి) సమానద్రవ్యము.
నీకేతనమ్ (న) ఇల్లు.
నీచః (పు) నీచుఁడు (త్రి) పొట్టిది.
నీచైః (అ) కొంచెము.
నీడః (స్త్రీ) పిట్టగూడు - ఉనికిపట్టు.
నీడోద్భవః (పు) పక్షి.
నీతమ్ (న) ధనము - ధాన్యము - విహరించుట.
నీతః (త్రి) శిక్షింపఁబడినది - తేఁబడినది పొందఁబడినది.
నీతిః (త్రి) పొందించుట - న్యాయము.
నీపః (పు) మొగులుకడిమిచెట్టు-నల్లయశోకము.
నీరమ్ (న) నీళ్లు.
నీలమ్ (న) నీలవర్ణము- విషము.
నీలకణ్ఠః (పు) బంగారుపిచ్చుక- శివుఁడు నెమలి-పాము-ఊరపిచ్చుక-కాటుకపిట్ట.
నీలఙ్గుః (పు) పురుగు-తుమ్మెద.
నీలతి (ధా) ప - శప్ - నల్లగానుంచున్నాఁడు
నీలలోహితః (పు) శివుఁడు.
నీలామ్బరః (పు) బలరామస్వామి.
నీలామ్బుజన్మ (న) నల్లగలువ.
నీలినీ (స్త్రీ) నీలిచెట్టు
నీలీ (స్త్రీ) నల్లపెద్దగోరంట- నీలిచెట్టు-కనుబొమ్మ-నల్లనివర్ణముఁగలవస్తువు
నీవారః(పు)విత్తకుండాపండెడుధాన్యము
నీవీ (స్త్రీ) స్త్రీలకోకకట్టు-పోఁకముడి - అసలుసొమ్ము- పందెమునకుంగట్టినద్రవ్యము

నీవృత్ (పు) పల్లెటూరు.
నీవ్రమ్ (న) ఇంటిచూరు.
నీహారః } (పు) మంచు.
నీహారః }
ను (అ) ప్రశ్న-వికల్పము- ఈలాగో ఆ లాగో యని యూహించడము - రెంటనొక్కవిధము- ప్రతిమాట - తెలియగోరుట- పాదపూర్తి- దుఃఖము- కొంచెము.
నుః (పు) బాణము-ఓడ-కాలము.
నుః (సీ) స్తుతి.
నుతిః (సీ) స్తోత్రము.
నుత్తః } (త్రి) త్రోయ్యఁబడినది.
నున్నః }
న్యుబ్జః (త్రి) గూనివాఁడు-పొట్టివాఁడు.
న్యూఙ్ఖః (పు) సామవేదముయొక్క ప్రణవములకారింటికి పేరు (త్రి) మనోహరము-సుందరము.
నూతనః } (త్రి) క్రొత్తది.
నూత్నః }
నూనమ్ (అ) ఊహించుట- నిశ్చయము- ఉత్ప్రేక్షించుట-అసత్యము - తర్కవ- ప్రయోజనము - భావార్థకము-నిరోధించుట.
న్యూనమ్ (న) ఒకలెక్కలోమఱియొకలెక్కతీసివేయుడము.
నూపురః (సీ) కాలియందె-నాట్యశాలలోనిభేదము-నూపురాలంకారము
నృత్తమ్ } (న) శరీరహస్తనేత్రాభినయములచేతభావమునుజూపుచునాడెడినాట్యము
నృత్యమ్ }
నృపః (పు) భూమినిపాలించెడిరాజు. [గు
నృపలక్ష్మ (న) రాజులకుపట్టెడుతెల్లగొడు
నృశంసః (పు) ఒకరనిపీడించుటయందాసక్తిఁగలవాఁడు.
నేతా (పు) వేఁపచెట్టు
నేత్రమ్ (న) కన్ను-కవ్వపుత్రాడు.
నేత్రామ్బు (న) కన్నీలు
నేదిష్ఠః (త్రి) మిక్కిలిదగ్గఱయైనది
నేమః { (త్రి) కొంత-సగము (పు) కాలము-రంధ్రము-ప్రాకారము- మోసము.
నేమిః } (పు) నెమ్మిచెట్టు (ద్వి) నూతిగిలక.
నేమీ (పు) వేఁపచెట్టు
నైకభేదః (త్రి) అనేకప్రకారములు.
నైగమః (పు) వర్తకుఁడు-వేదశాఖలోనియుపనిషత్తు-మంగలవాఁడు-పాశుపతాస్త్రముమొదలైనది.
నైచికీ (సీ) మంచియావు.
నైపాలీ (సీ) నేపాలదేశపుమణిశిల
నైయగ్రోధమ్ (న) మఱ్ఱిపండు
నైరృతః (పు) నైరుతిమూల.
నైష్కికః (పు) టంకసాలాధికారి.
నైస్త్రింశికః (త్రి) పొడుగుకత్తిఁగలవాఁ
నో (అ) లేదు- కాదు　　[డు.
నౌః (సీ) ఓడ-కాలము.
నౌకాదణ్డః (సీ) ఓడనడిపెడుగడ.

## ప

పమ్ (న) సమ్మతి-బంగారు - పాపము-త్రాగుబోతు-వ్రతము- కూడు.
పః (పు) సప్తమస్వరములలో పంచమస్థానము-గాలి-కొండ- ప్రకాశము-కౌస్తుభరత్నము - క్షణకాలము-శుభలగ్నము.

పక్వః (త్రి) ఆపదనొందినవాఁడు.
పక్వః (త్రి) పండినది-కాలమునందు ప
 క్వమైనబుధ్యాదులు.
పఙ్కః (సీ) పాపము-బురద.
పఙ్కిలః (త్రి) బురదదేశము.
పఙ్కేరుహమ్ (న) పద్మము.
పఙ్క్తిః (సీ) వరుస-పదిఅక్షరముల పాద
 ముగలఛందస్సు-పది.
పఙ్గుః (త్రి) పిచ్చుకవలెకుంటెడివాఁడు.
పచమ్పచా (సీ) మ్రానిపసుపు.
పచలిమః (త్రి) ఉడికినది.
పచా (సీ) వండడము.
పఞ్చజనః (పు) పురుషసామాన్యము.
పఞ్చజనీనకః (పు)భోఙ్జ్ఞావాఁడు.
పఞ్చజన్యః (పు) గుల్లము.
పఞ్చతా (సీ) } చావు.
✓పఞ్చత్వమ్ (న) }
పఞ్చదశ (త్రి) పదియేనువస్తువులు.
పఞ్చదశః (త్రి) పదియేనవది.
పఞ్చదశీ (సీ) పౌర్ణమావాస్యలు.
పఞ్చమః (పు) కోకిలస్వరమువంటిపంచ
 మస్వరము-మాలవాఁడు- సన్యా
 సి- దేవతావిశేషము-ఐదవది
పఞ్చలక్షణమ్ (న) పురాణము
పఞ్చశరః (పు) మన్మథుఁడు.
పఞ్చశాఖః (పు) ముంజెయ్యి
పఞ్చాఙ్గులః (పు) ఆముదపుచెట్టు
పఞ్చాస్యః (పు) సింగము-హరుఁడు- హ
 నుమంతుఁడు నేర్పరి
పఞ్చతే (ధా)ఆ-శప్- పచివ్యక్తీకరణే-
 విభాగము చేయుచున్నాఁడు.
పటమ్ (న) బట్ట.
పటః (పు) మొరలిచెట్టు-మంచిబట్ట- ప
 ధారణవస్త్రము-మొదటిది.
పటచ్చరమ్ (న) పాతబట్ట
పటతి (ధా) ప-శప్ పటగతౌ - తిరుగు
 చున్నాఁడు
పటలమ్ (న)ఇంటికప్పు-గుంపు-కంటిరో
 గము-నారబట్ట
పటలప్రాంతమ్ (న) కొణిగెచూరు.
పటవాసకః (పు) బుక్కాలోభేదము.
పటహః (సీ) తప్పెట.
పటీ(సీ)మంచిబట్ట-బట్ట-దుప్పటి-తక్కు
పటీరః (పు) గంధపుచెట్టు [వబట్ట.
పటుః (త్రి) వాఁడి-రోగములేనివాఁడు-
 నేర్పరి - సమర్థుఁడు-శక్తుఁడు.
 (పు)చేతిపొట్ల-విద్యయందుసామ
 ర్థ్యముఁగలవాఁడు- శరీరముదాఁ
 పనిబంటు
పటుపర్ణీ (సీ) కంఠోష్ఠచెట్టు.
పటోన్దః (త్రి) నీరుల్లి.
పటోలః (పు) చేఁతిపొట్లచెట్టు- సమూ
 హము-పాటలవర్ణము- ఏనుగఁపు
 గట్టుకొయ్య
పటోలికా (త్రి) పొట్లచెట్టు.
పట్టణమ్ (న) నగరము.
పట్టికా (సీ) కమ్మరవానిదాగలి.
పట్టికాఖ్యః (పు)పట్టికాలోధ్రవృక్షము.
పట్టీ (పు) నొసటిభూషణము
పఠతి (ధా) ప - శప్- పరవ్యక్తాయాం
 వాచి-చదువుచున్నాఁడు.
పణతే (ధా) ఆ - శప్ - పణవ్యవహారే
 స్తుతౌచ- వ్యవహారము చేయుచు
 న్నాఁడు - స్తుతించుచున్నాఁడు

పణః (పు) కొనటము-కర్షమెత్తు తామ్రముద్ర అనఁగాఁబదియాఱుమాషకములయెత్తుగాని - ౩౨ - గురివెందగింజలయెత్తుగానియనుట - కూలి-జూదము-పందెము

పణవః (పు) చిన్నతప్పెట-ఏనుఁగుమెడ

పణ్డతే (ఆ) ఆ - శప్ - పడిగతో వెళ్లుచున్నాఁడు.

పణాయతి (ప) ఆ-శప్- పణవ్యవహారేస్తుతౌచ - వ్యవహారమును జేయుచున్నాఁడు - స్తుతించుచున్నాఁడు

పణాయితః (త్రి) స్తుతదేవతాదులు

పణితవ్యః } (త్రి) అమ్మఁదగినది
పణ్యః }

పణ్యవీథికా (స్త్రీ) అంగళ్లబజారు

పణ్యా (స్త్రీ) ఎక్కుడుతీఁగె

పణ్యాజీవః (పు) క్రయవిక్రయకారుఁడు దుకాణదారి

పతఙ్గః (పు) సూర్యుఁడు-మిడుత- ధాన్యవిశేషము - పిల్లి-పిట్ట-బాణము-పాదరసము

పతఙ్గికా (స్త్రీ) తేనెటీగ.

పతత్రమ్ (న) పిట్టరెక్క.

పతత్రిః } (పు) పిట్ట.
పతత్రీ }

పతద్గ్రహః } (పు) పీకదాను
పతద్గ్రాహః }

పతయాలుః (త్రి) పడేనైజముఁగలవాఁడు

పతాకః } (పు) అభినయముతోఁ
పతాకస్వస్తికః } గూడుకొనిన సంయుక్తముహస్తము

పతాకా (స్త్రీ) ధ్వజము.

పతాకీ (త్రి) నిశానీపట్టేవాఁడు.

పతింవరా (స్త్రీ) తానుకోరిపతినివరించుస్త్రీ-నల్లజీలకఱ్ఱ.

పతిః (పు) మగడు

పతిపత్నీ (స్త్రీ) ఒకపెనిమిటిగల,స్త్రీ-ముత్తైదువ.

పతివ్రతా (స్త్రీ) పతివ్రత

పత్తనమ్ (న) పట్టణము.

పత్తిః (పు) కాలిబంటు-శూరుఁడు (స్త్రీ) ఒకఏనుఁగ,ఒకరథము ౩-గుఱ్ఱములు,౫-కాలిబంట్లుకలసేన-పోవు[ట.

పత్నీ (స్త్రీ) భార్య

పత్రమ్ (న) ఆకు- లవంగపుచెక్క-ఆకుపత్రికము- పిట్టరెక్క-సామాన్యమైనవాహనము- సూరకత్తి.

పత్రపరశుః (పు) ఆకురాయి

పత్రపాశ్యా (స్త్రీ) పాపిటబొట్టు.

పత్రరథః (పు) పిట్ట

పత్రలేఖా (స్త్రీ) స్త్రీస్తనకపోలాదులయందువ్రాయుమకరికాపత్రాదులు.

పత్రాఙ్గమ్ (న) ఎఱ్ఱగంధము - పుష్కరమూలము

పత్రీ (పు) డేగ-పిట్ట-బాణము.

పత్రోర్ణమ్ (న) తెల్లపట్టుబట్ట

పథికః (పు) త్రోవనడిచెడువాఁడు

పథికీ (స్త్రీ) దాటినదుబారిగాఁడుది.

పదమ్ (న) గుఱుతు-మోసము-ఒకానొకకర్తాస్థానము-అడుగు-నెపము-రక్షణము-కిరణము- ప్రయత్నము సుబంతము-తిఙంతము-శాణము-వాక్యము-పాట-ఆఅంగుళములు

పదగః (పు) కాలిబంటు.
పదవీ (స్త్రీ) మార్గము.
పదాజిః (పు) కాలిబంటు-త్రోవ - జగ
పదాతిః(పు) కాలిబంటు, [డము
పదికః } (పు) కాల్బలము.
పత్తిః }
పద్ధతీ (స్త్రీ) మార్గము
పద్మః (పు) పద్మవ్యూహము - పాము-న
లున-బలరాముఁడు
(స్త్రీ) పద్మమనునిధి-తమ్మిపువ్వు
పద్మకమ్ (న) పుష్కరమూలపుచెట్టు-ఏ
నుఁగుదేహపు తెల్లమచ్చలపొడ -
తామరకాడ - మొగ్గ.
పద్మ కేసరః (పు) పొన్నచెట్టు
పద్మగర్భః (పు) విష్ణువు-చెఱువు- సాల
గ్రామము-బ్రహ్మ
పద్మచారిణీ (స్త్రీ) మెట్టుగుదామర.
పద్మనాభః (పు) విష్ణువు
పద్మపత్రమ్(న)పుష్కరమూలమనుచెట్టు
పద్మరాగః (పు) కెంపులోభేదము
పద్మా (స్త్రీ) లచ్చి - చిఱుతేకుచెట్టు- మె
ఱుఁగుదామర - మెట్టతామర-స
రస్వతీ-నల్లనిపద్మము-పార్వతీ-
ఆడుజింక.
పద్మాకరః (పు) చెఱువు
పద్మాలయా (స్త్రీ) కలుములజవరాలు - ల
వంగము.
పద్మినీ (స్త్రీ) తామరతీగె - స్త్రీజాతివిశే
పద్యా (స్త్రీ) త్రోవ. [షము
పనసః (పు) పనసచెట్టు.
పనాయితః } (త్రి)స్తుతిచేయఁబడినది
పనితః }

పన్నః (త్రి) జారినది.
పన్నగః (పు) పాము
పన్నగాశనః (పు) గరుత్మంతుఁడు.
పయః (న) జలము - పాలు
పయణతి (ధా) ప-శప్-పయణ్ప్రగతిప్రే
రణశేషణేషు - గమనముచేయు
చున్నాఁడు - ప్రేరణ చేయు
చున్నాఁడు
పయస్యమ్ (న) నెయ్యి - వెఱుగుచల్ల
మొదలయినవి.
పయస్వినీ (స్త్రీ) ఆవు - రాత్రి.
పయోధరః (పు) స్త్రీస్తనము-మేఘము.
పరజాతః (త్రి) కొనిపెంచినబంటు.
పరః (పు) చేతిపొట్ల (త్రి) పెద్దవాఁడు
శ్రేష్ఠుఁడు - మఱియొకఁడు
ఆవలిది
పర్దతే (ధా) అ - శప్ - అపానవాయు
వునువిడుచుచున్నాఁడు
పర్పతి (ధా) ప - శప్- పర్పగతౌ- వె
ళ్ళుచున్నాఁడు
పర్బతి (ధా) ప-శప్-పర్బగతౌ - వెళ్ళు
చున్నాఁడు
పరప్పురాకమ్ (న) యజ్ఞమునందలిపశు
వధ
పరమ్పరావాహనమ్ (న) రథమునకుఁగ
ట్టుమోకు
పరతన్త్రః (త్రి) ఒకరియధీనమునసున్న
వాఁడు.
పరపిణ్డాదః (త్రి) ఎల్లప్పుడితరులయన్న
మునుఁదినువాఁడు.
పరభృత్ } (పు) కాకి-కోయిల.
పరిభృతః }

పరమమ్ (అ) సమ్మతము,
పరమాన్నమ్ (న) పాలతోవండినయన్నము.
పరమేష్ఠీ (పు) బ్రహ్మ.
పరవాన్ (త్రి) ఒకరివశమునసున్నవాఁడు
పరశుః } (పు) గండ్రగొడ్డలి
పరశ్వధః }
పరశ్వః (అ) ఎల్లుండి.
పరశ్శతః (త్రి) నూరధికముగాఁగలవస్తువులు
పరాక్రమః (పు) శౌర్యము-ఉద్యోగము
పరాగః (పు) పుప్పొడి - నలుగుపిండి - ధూళి.
పరాఙ్ముఖః (త్రి) పెడమొగముచేసికొనినవాఁడు.
పరాచితః (త్రి) కొన్నపెంపుడుబంటు
పరాచీనః (త్రి) పెడమొగముచేసికొనినవాఁడు
పరాజయః (పు) ఓడిపోవడము.
పరాజితః (త్రి) ఓడినవాఁడు.
పరాధీనః (త్రి) ఒకనివశమునసున్నవాఁడు.
పరాన్నః (పు) ఒకరియన్నముఁదినువాఁడు.
పరాభూతః (త్రి) ఓడినవాఁడు.
పరాయణః (త్రి) ఒకరివస్తువుందాసక్తిఁగలవాఁడు.
పరారి (అ) మునియేఁడు.
పరార్ధ్యః (త్రి) ప్రధానమైనది.
పరాసుః (త్రి) చచ్చినవాఁడు.
పరాస్కన్దీ (పు) దొంగ.
పరి (అ) అనశాలు - ఇట్లనుట - భాగము - అతిశయము- అంతటనుండడము- ప్రాణమువిడిచినవాఁడు
పరికరః (పు) దళము - అస్త్రము మొదలైనది - పరిజనము - మంచము-శయ్య-లెలివి- మొదలుపెట్టుట- గాత్రికాబంధవిశేషము.
పరికర్మ (న) దేహమాలిన్యమును బోగొట్టుకొనడము.
పరిక్రమః (పు) తాలప్రాణకలా విశేషము-వేడుకగాఁదిరుగుట
పరిక్రియా (స్త్రీ) అంతటాయుండడము.
పరిక్షిప్తః (త్రి) చుట్టుకొనినది.
పరిఖా (స్త్రీ) అగడ్త.
పరిగ్రహః (పు) అద్దము మొదలయినది.
పరిఘః (పు) పంచాంగయోగవిశేషము-లాటీకఱ్ఱ - ఇనుపకట్లకఱ్ఱ-కిడవు-ప్రాకారము - గోపురము - గాజుకుండ
పరిఘాతనః (పు) లాటీకఱ్ఱ
పరిచయః (పు) స్నేహప్రధానమగునమ్మకము.
పరిచరః (పు) సేనచుట్టూకాచువాఁడు.
పరిచర్యా (స్త్రీ) కొలుచుట.
పరిచాయ్యః (పు) యజ్ఞాగ్నియందుఁబ్రయోగించబడినది.
పరిచారకః (పు) సేవకుఁడు.
పరిణతః (పు) కొమ్ములనడ్డముగాఁద్రిప్పిపొడిచెడు ఏనుఁగ (త్రి) పరిపక్వమయినది - వృద్ధియైనది.
పరిణయః (పు) పెండ్లి.
పరిణామః (పు) ఒకానొకయలంకారము-స్వభావముకానిది.
పరిణాయః (పు) సొగటాలుకిచ్చడము-పాచికలువెయ్యడము.
పరిణాహః (పు) వెడలుపు.

పరితః (అ) అంతటా.
పరిత్రాణమ్ (న) చంపఁబోఁగానడ్డగించు కొనిరక్షించడము.
పరిదానమ్ (న) సాటూకొట్టె.
పరిదేవనమ్ (న) కలవరింత.
పరిధానమ్ (న) కట్టుకొనుబట్ట
పరిధిః (పు) సూర్యాదిపరివేషము-కోట-యజ్ఞాస్తమయిన మేడిచెట్టుమొదలగువాఁటికొమ్మలు - ఒకానొక ఆయుధము-బొగ్గు.
పరిధిస్థః (పు) సేనచుట్టూకాచెడివాఁడు.
పరిపన్థీ (పు) పగవాఁడు-త్రోవఁగాచి-కొట్టుదొంగ.
పరిపాటిః } (స్త్రీ) స్వాధ్యాయక్రమము.
పరిపాటీ
పరిపేలవమ్ (న) తుంగముస్తె. [చునది.
పరిప్లవః (త్రి) హస్తాదికము, ఆనఁగాజలిం
పరిబర్హః (పు) రాజులకుఁదగినవస్తువు-అగ్గి - ఒకభాగము - తునక-పరిజనము.
పరిభవః (పు) అవమానము-తిరస్కారము
పరిభాషణమ్ (న) మాటలాడుట- యమము
పరిభూతః (త్రి) తిరస్కరింపబడినవాఁడు
పరిమలః (పు) ఇంపగువాసనరెండుమూఁడువస్తువులుకలిసినూరడము- సంభోగక్రమవలననలిగిఎట్టిదైన దేహామందలి యుంగరాగపు పరిమళము.
పరిరమ్భః (పు) కౌగలించడము.
పరివర్జనమ్ (న) చంపడము.
పరివసితః } (త్రి) ఉపచరించినగురువు మొదలగు పెద్దలు.
పరివస్యితః
పరివాదః (పు) జాత్యాచారములచేదూషించుట - వీణవాయించుటకు సాధనము
పరివాదినీ (స్త్రీ) ఏఁడుతంత్రులుగలవీణ.
పరివాపితః (త్రి) గొఱుగఁబడినది
పరివిత్తిః (పు) తమ్మునకుఁ బెండ్లియైయుండగా- బెండ్లికానియున్న
పరివృఢః (త్రి) ఏలువాఁడు
పరివేత్తా (పు) అన్నకన్నముందు పెండ్లియాడినవాఁడు.
పరివేశమ్ (న) } సూర్యపరివేషము.
పరివేషః (పు)
పరివ్యాధః (పు) నీటుప్రబ్బచెట్టు-కొండగోఁగుచెట్టు.
పరివ్రాజకః (పు) సన్యాసి.
పరిషత్ (స్త్రీ) సభ.
పరిష్కారః (పు) ఆభరణము-నిర్ణయము
పరిష్కృతః (త్రి) అలంకరించుకొనిన వాఁడు.
పరిష్వఙ్గః (పు) కౌఁగలించుకొనుట.
పరిసరః (పు) నగరసమీపభూమి - మృత్యువు-దైవము.
పరిసర్పః (పు) చుట్టుకొనివచ్చుట.
పరిసర్యా (స్త్రీ) అంతటఁతిరగడము.
పరిస్రుతా (స్త్రీ) కల్లు.
పరిస్కన్దః (పు) కొనిపెంచినబంటు
పరిస్తోమః (పు) ఏనుఁగుమీఁదఁబరిచెడి చిత్రకంబలము.
పరిస్పన్దః (పు) అద్దముమొదలగు సుభశోభనములు- పూలుకట్టుట.
పరీక్షకః (త్రి) దానాదులయందుఁబరీక్షించువాఁడు.

పరీభావః (పు) తిరస్కారము
పరీవర్తనమ్ (న) సరుకుమార్చుకొనుట
పరీవాదః (పు) జాత్యాచారములచేత దూషించుట
పరీవారః (పు) తిరుగులాడెడుజంతువు- కత్తియొఱ - ఒకభాగము- తునక.
పరీవాహః (పు) మదము
పరీవృతః (త్రి) నలుప్రక్కలఁ జుట్టుకొనబడినది - పొందఁబడినది - తెలిసినది
పరీసారః (పు) అంతటాతిరుగుట
పరీహాసః (పు) స్త్రీపురుషపరిహాసము
పరుత్ (అ) నిరుడు.
పరుషః(త్రి) పరుషవాక్కు-చిత్రవర్ణము
పరేతః (పు) నరకమునవున్న జంతువు భూతములలోనొకటి- జముఁడు- (త్రి) చచ్చినవాఁడు
పరేద్యవి (అ) మరునాడు
పరేషుకా (స్త్రీ)చాలాయీతలీనినయావు
పరైధితః (త్రి) కొనిపెంచినబంటు.
పరోష్ణీ (స్త్రీ) గబ్బిలము.
పర్కటీ (స్త్రీ) జువ్విచెట్టు-పోకకాయలు మొదలగుక్రొత్తది.
పర్జనీ (స్త్రీ) మ్రానిపసపు.
పర్జన్యః(పు)పంద్రెండుగురుసూర్యులలోనొకఁడు- ఉఱుముచున్నమబ్బు- ఉఱుము-ఇంద్రుఁడు-దాత- మేడకువెనుకటిప్రక్క.
పర్ణమ్ (న) ఆకు.
పర్ణశాలా (స్త్రీ) పర్ణశాల- అనఁగా ముని గృహము.
పర్ణాసః (పు) గగ్గెరచెట్టు.
పర్యఙ్కః (పు) యోగపట్టె- మంచము- పరివారము.
పర్యటనమ్ (న) తిరుగులాడుట.
పర్యయః (పు) క్రమముతప్పడము.
పర్యవస్థాతా (పు) పగవాఁడు.
పర్యాప్తమ్ (న) నిండాను
పర్యాప్తిః (స్త్రీ) చంపఁబోఁగాసడ్డగించుకొనిరక్షించడము- పొందుట-మిక్కిలి
పర్యాయః (పు) స్వాధ్యాయక్రమము-అవసరము-వరుస
పర్యగ్నుచనమ్ } (న) అప్పు.
పర్యుదఞ్చనమ్ }
పర్యేషణా (స్త్రీ) వెదకుట
పర్వ (న) అమావాస్య-పున్నమ- పాడ్యమి- అమవససంధి- పాడ్యమి- పున్నమసంధి - కొప్పునుడి - జడముడి-ఉత్సవము-అవసరము.
పర్వసన్ధిః (పు) పున్నమపాడ్యములకును అమావాస్య పాడ్యములకును మధ్యకాలము
పర్శుకా (స్త్రీ) అస్థిపంజరము క్రిందియెముక- వెన్నుయెముక
పలమ్ (న) ౪-కర్షములయెత్తు - మాంసము- ౩౨౦ గురిగింజలయెత్తు
పలగణ్డః (పు) ఉప్పరివాఁడు [ట్టు.
పలఙ్కషః(పు)రక్కసుఁడు-గుగ్గిలపుచె
పలలః (పు) పాలనుతిండిపోతు - జయంతుఁడు
పలాణ్డుః (పు) నీరుల్లిచెట్టు
పలాలః (స్త్రీ) ధాన్యాదులగడ్డి అనఁగావరిచొప్ప.

పలాశః (పు) ఆకువచ్చన - మోదుగుచెట్టు-ఆలుగండ్లకచ్చూరము-రాక్షసుఁడు.

పలాశీ (పు) చెట్టు- పొలసులిండిపోతు- (స్త్రీ) నల్లనేలగుమ్ముడుచెట్టు.

పలిక్నీ (స్త్రీ) ముసలిది - తొలుచూలు పెయ్య

పలితః (త్రి) నెఱసినవాఁడు.

పల్యఙ్కః (పు) మంచము- యత్యాద్యాసనము,

పల్లవః (స్త్రీ) చిగురు-కోకచెంగు-మైజారు (పు)లఞజకాఁడు- వందువాఁడు గీతాంగము.

పల్లవాత్ (పు) చాలపిల్లి.

పల్లవాస్త్రః (పు) మన్మథుఁడు.

పల్లవికః (త్రి) ఒఱుడు

పల్వలః (పు) నీళ్లగొయ్యి.

పవః (పు)<br>పవనమ్(న) } ధాన్యమును దూర్పెత్తడము.

పవనః (పు) గాలి

పవనాశః<br>పవనాశనః } (పు) పాము.

పవమానః (పు) గాలి

పవిః (పు) నూఱంచులవాలు- అనఁగావజ్రాయుధము-వజ్రము - ఆయుధములయందు.

పవిత్రమ్ (న) విష్ణువుయొక్క చక్రము-కుశదర్భగడ్డి-పెరుగుకుండ - పేడ-జలము-రాగి-జందెము - మంత్రము-బంగారము.

పవిత్రకమ్ (న) వలత్రాడు-నెయ్యి.

పశుపతిః (పు) శివుఁడు-ఎద్దు

పశ్చాత్ (అ) పడమటిదిక్కు-తరువాత-చివర - పగ - చపలత - ఆరంభణవిశేషము - మొదలుపెట్టుట - ఉపాయము.

పశ్చాత్తాపః (పు) వెనకచింతించుట.

పశ్చిమః (త్రి) చివరది-వెనుకది.

పష్ఠౌహీ (స్త్రీ) తొలుచూలుపడ్డ

పక్షః (పు) ౧౫ - అహోరాత్రములుఅనఁగాఁబున్నమ, అమవసలతోఁ జేరిముందుండు దినములు - పిట్టఱెక్క-బాణమునందుండు పక్షిఱెక్క - తోడు- అంబారియేనుఁగు - బలము - పరాధీనము - తలవెంట్రుకలు-గ్రహము-నాట్యము-చెయ్యి- గోడ - కొప్పు

పక్షకః (పు) దిడ్డివాకిలి- పక్క.

పక్షతిః (త్రి) పాడ్యమి- పిట్టఱెక్క మొదలు.

పక్షద్వారమ్ (న) దిడ్డివాకిలి.

పక్షభాగః (పు) ఏనుఁగుప్రక్క వైపు

పక్షాన్తః (పు) అమవస-పున్నమ

పక్షిణీ (స్త్రీ) కైదుచెయ్యఁబడినవాఁడు - బందిఖానాయిల్లు-బచ్చలి

పక్ష్మ (న) కనుఱెప్పవెంట్రుకలు- సూక్ష్మమైననూలుపోగు-పాయిరంశ్రము

పాకః(పు) శిశువు-వండుట- ముట్టురక్తము-మలము-జ్వరము - పాకాసురుఁడు-కలివిచెట్టు.

పాకలమ్ (న) చెంగలికోష్టు.

పాకశాసనః (పు) ఇంద్రుఁడు.

పాకశాసనిః (పు) ఇంద్రునికొడుకు అనఁగా జయంతుఁడు.

పాకస్థానమ్ (న) వంటయిల్లు.

పాక్యమ్ (న) బిడాలలవణము.

పాఞ్చజన్యః (సీ) విష్ణుశంఖము-శంఖము

పాఞ్చాలికా (సీ) బొమ్మ-ద్రౌపదీదేవి-విజాతీయగోడ-రీతిభేదము.

పాట్ (అ) సంబోధనార్థము.

పాటచ్చరః (పు) దొంగవాఁడు.

పాటలః (త్రి) ఎక్కుడు తెలుపుకలిసిన ఎఱుపువర్ణముగలది

పాటలా (సీ) పాటలీపుష్పము-కలిగొట్టుచెట్టు-పాటలవర్ణముగల య్యావు

పాటలిః (స్త్రీ) కలిగొట్టుచెట్టు.

పాఠః (పు) చదువడము.

పాఠా (సీ) పాటచెట్టు

పాఠీనమ్ (న) చిత్రమూలము.

పాఠీనః (పు) వెయ్యికోరలుగలచేప.

పాణిః (పు) కర్మేంద్రియవిశేషము-మంజెయ్యి-ధనము-శత్రుబాధచేయు [వాఁడు

పాణిగృహీతీ (సీ) పెండ్లిదేవి.

పాణిఘః (పు) చప్పట్లుకొట్టి బ్రతికెడివాఁడు-అనగా తాళగాఁడు.

పాణిపీడనమ్ (న) పెండ్లి

పాణివాదః (పు) తాళగాఁడు.

పాణ్డరః, పాణ్డుః } (పు) తెలుపు-ఎక్కుడు తెలుపుగలసినపసుపువర్ణము.

పాణ్డుకమ్బలీ (పు) తెల్లకంబళులు కప్పిన రథము.

పాణ్డురః (త్రి) తెలుపుపచ్చనగల రంగు.

పాతాలమ్ (న) క్రిందినాలవలోకము-బడబాగ్ని-ఉదకము-సాధారణముగాను క్రిందియేడులోకములు.

పాతుకః (పు) కొండచఱియ-నీటియేనుగు-సొగటాలపాచిక.

పాత్రమ్ (న) అన్నిశాస్త్రములను-కంతము-నాట్యమునకు నియోగింపఁబడిన స్త్రీపురుషులు-తగినవాఁడు-ప్రవీణుడు-రాజమంత్రి-స్రుక్కు మొదలగుహోమపాత్రము

పాథః (పు) ఉదకము-అన్నము-పరమాత్మ-ప్రాఁతది-చాలాకాలమునాఁటిది.

పాదః (పు) కిరణము-కర్మేంద్రియభేదము-పాదము-కొండదరిమెట్టు-నాలవవంతు-వేరు

పాదకటకమ్ (న) కాలికడియము.

పాదగ్రహణమ్ (న) పాదములదాఁకిగోత్రనామపూర్వకముగాఁ బ్రవర చెప్పి మ్రొక్కుట

పాదపః (పు) వృక్షము. [లయినవి.

పాదబన్ధనమ్ (న) ఆవులు గేదెలు మొద

పాదస్ఫోటః (పు) కాళ్లుపగిలెడు కుష్ఠు.

పాదాఙ్గదమ్ (న) పాగడము-బిరుదు-పెండేరము.

పాదాతమ్ (న), పాదాతికః (పు) } కాలిబలము.

పాదుకా (సీ) పావుకోళ్లు.

పాదూః (సీ) పావుకోళ్లు-చెప్పులు.

పాదూకృత్ (పు) గొడారువాఁడు.

పాద్యః (త్రి) పాదోదకము.

పానమ్ (న) రక్షణము.

పానగోష్ఠికా (సీ) పదిమందికూడిమద్యపానముచేసెడిస్థలము.

పానపాత్రమ్, పానభాజనమ్ } (న) కల్లుత్రాగుగిన్నె

పానీయమ్ (న) ఉదకము.

పానీయశాలికా (స్త్రీ) చలివేంద్ర.

పాన్థః (పు) తెఱువరి

పాపః (త్రి) పాపి-ఒకరినిపీడించుటయందాసక్తిగలవాఁడు- నిందితుఁడు

పాపచేలీ (స్త్రీ) పాటచెట్టు.

పామః (పు) పాపాత్ముఁడు.

పామనః (త్రి) గజ్జిపట్టినవాఁడు.

పామరః (పు) నీచుఁడు

పామా (స్త్రీ) గజ్జి.

పాయసః { (పు) దేవదారు బంకతో చేసినధూపము. (స్త్రీ) పరమాన్నము.

పాయుః (పు) గుదస్థానము.

పాయ్యమ్ (న) జేన-మూర-గజము మొదలైనది-నీఱు-నిందార్థమైనది

పారః (స్త్రీ) అద్దరి.

పారతః / పారదః } (పు) పాదరసము.

పారశీకః (పు) పారశీకదేశపుగుఱ్ఱము.

పారశ్వధికః (త్రి) గండ్రగొడ్డలిపట్టెడువాఁడు

పారస్త్రైణేయః (పు) పరస్త్రీపుత్రుఁడు

పారా (స్త్రీ) వరుస-వేదముజదువుట.

పారాయణమ్ (న) అంతౌచదివడము - అంతౌననుట-తుదముట్టుట

పారావతః (పు) కోతితుమికిచెట్టు- పావురము.

పారావతాఙ్ఘ్రిః (స్త్రీ) ఎక్కుడుతీఁగె.

పారావారః (పు) సముద్రము.

పారాశరీ (పు) సన్న్యాసి

పారికాఙ్క్షీ (పు) చాంద్రాయణాది వ్రతశీలుఁడు-ఋషి

పారిజాతః (పు) దేవవృక్షము.

పారిజాతకః (పు) వాడిదపుచెట్టు

పారితథ్యా (స్త్రీ) రాగిడిబిళ్ల-సిగపువ్వులు.

పారిప్లవః (పు) కుస్తరవాఁడు-పూలుగంధము మొదలగునవి (త్రి) చలించునది.

పారిభద్రః (పు) వాడిదపుచెట్టు- దేవదారుచెట్టు-మారేడుచెట్టు-వేపచెట్టు.

పారిభద్రకః (పు) దేవదారువృక్షము పారిజాతపుచెట్టు

పారిభావ్యమ్ (న) చంగలికోష్ఠు

పారియాత్రకః (పు) పారియాత్రకపర్వతము

పారిషదః (పు) శివసభయందుండు ప్రమథులు-రాజసభయందుండు న్యాయవేత్తలు

పారిహార్యః (పు) బంగారుపుసూడిగాలు.

పారీ (స్త్రీ) పాలుపితికెడుకుండ.

పారుష్యమ్ (న) వివాదమందలి కఠినవాక్కు-కాఠిన్యము-ఇంద్రవనము.

పార్థివః (పు) అఱువదిసంవత్సరములలో నొకటి-రాజు-గుఱ్ఱము.

పార్వతీ (స్త్రీ) పార్వతీదేవి-అందుగుచెట్టు.

పార్వతీనన్దనః (పు) కుమారస్వామి

పార్శ్వమ్ (న) వీపుయెముకలగుంపు.

పార్శ్వావర్తః (పు) ప్రక్కనుడి-యాఁడుదానికి సుఖం డుటకుగుటుతు.

పార్ష్ణిణీ (స్త్రీ) వెఱ్ఱిపట్టినయాఁడుది.

పార్ష్ణిగ్రాహః (పు) ముందటికిబోఁగావెనుకబాగపట్టెడు శత్రువు

పాలఙ్క్యః (పు) గుఱ్ఱము-పిట్ట

పాలఘ్నః (పు) గొడుగుగడ్డి

పాలాశః (పు) పలాశవర్ణము - అనఁగా నాకుపచ్చవర్ణము.

పాలినీ (స్త్రీ) నల్లతెగడ
పావకః (పు) అగ్ని-ఎఱ్ఱచిత్రమూలము - పరిశుద్ధుఁడు-జీడిచెట్టు - విళంగ సారము-కూరనెల్లిచెట్టు.
పాశః (పు) సోగటాలపాచిక-త్రాడు - బాణము.
పాశకః (పు) సోగటాలపాచిక
పాశీ (పు)వరుణుఁడు-పెద్దగుమ్మడుచెట్టు
పాశుపతః (పు) బకపుష్పపుచెట్టు - పాశుపతమతమువాఁడు.
పాశుపాల్యమ్ (న) గోవులు గుఱ్ఱములు మొదలగువానిఁగాపాడుట.
పాశ్చాత్యః (పు) వరుణుఁడు.
పాశ్యా (స్త్రీ) త్రాళ్లసమూహము
పాషణ్డః (పు) జటాకమండలు కాషాయాదులనుధరించి వేదనిషిద్ధులగు క్షపణమతస్థులు
పాషాణః (పు) ఱాయి
పాషాణదారకః } (పు) ఱాయిదొలిచెడువులి
పాషాణదారణః }
పాళీ (స్త్రీ) అంచు-చిహ్నము-ప్రదేశము-పఙ్క్తి-మీసాలుగల(స్త్రీ)- చెవితమ్మె
పికః (పు) కోయిల-కాకి-నక్రవాకము
పికవర్ధనః (పు) కాకి
పిఙ్గమ్ (న) ఇంగువ
పిఙ్గః (పు) మూషకము
పిఙ్గలః (పు) సూర్యపార్శ్వచరుఁడు - ముంగిస.
పిఙ్గలా (స్త్రీ) ఆఁడుగుడ్లగూబ- ముక్కుకు డిరంధ్రము.
పిచణ్డః (పు)కడుపు-పడక- పశువులయంగము-బొమ్మ
పిచణ్డిలః (త్రి) బొజ్జగలవాఁడు.
పిచిణ్డః (పు) కడుపు
పిచుః (పు) దూది
పిచుమన్దః } (పు) వేఁపచెట్టు
పిచుమర్దః }
పిచులః (పు) దూది-పింజలవర్ణము -నీటికాకి
పిచ్చటమ్ (న) తగరము-సీసము.
పిచ్చటః (పు) కంటిరోగము
పిచ్ఛమ్ (న) శివునిత్రిశూలము- క్రిందిపెదవిక్రిందిపల్లము
పిచ్ఛా (స్త్రీ) బూరుగుబంక- గుఱ్ఱపుకాలిరోగము-తుండము-నిర్భాగ్యుఁడు.
పిచ్ఛిలః (ద్వ) ఇరుగుడుచెట్టు.
పిచ్ఛిలా(స్త్రీ)బూరుగుచెట్టు-తిరిగూలిగడ్డి.
పింజః (పు) చంపడము
పిఞ్ఛమ్ (న) విష్ణుశిరోభూషణము- నెమలిపురి-పక్షి ఱెక్క.
పిఞ్జరమ్ (న) హరిదలము-బంగారము.
పిఞ్జలః (పు) కుశునికొమరుఁడు
పిటః (పు) గంప
పిటకః (పు) పెట్టె
పిఠరః (పు) కుండ-బాణము-వేషము.
పిణ్డమ్ (న) వెన్న-ఇనుము-కడుపులోనిపిండము -ఏనుఁగుకుంభస్థలము-తగరము-దట్టము- బలము- ఇంటియంశము
పిణ్డకమ్ (న) హరిదలము.
పిణ్డతే (ధా) ఆ - శవ్ -పిడిసంఘాతే- పోఁగుచేయుచున్నాఁడు
పిణ్డికా (స్త్రీ) బండినడిమికన్ను- తొడలయొక్కమాంసము.
పిణ్డీతకః (పు) మ్రింగచెట్టు-మరువము.

పితామహః (పు) బ్రహ్మ-తండ్రి తండ్రి-
తండ్రి-శివుఁడు-విష్ణువు
పితృః (పు) తండ్రి
పితృపతిః (పు) యముఁడు
పితృపితృః (పు) తండ్రితండ్రి
పితృప్రసూః (స్త్రీ) సంధ్యాకాలము
పితృభ్రాతా } (పు) తండ్రితోఁడఁబుట్టి
పితృవ్యః } నవాఁడు.
పితృవనమ్ (న) శ్మశానము
పిత్తమ్ (న) పైత్యము
పిత్సన్ (పు) పక్షి
పిధానమ్ (న) ఏనుఁగుమీఁదిబుతశా.
పినద్ధః (త్రి) కట్టఁబడినవస్త్రముమొద
లయినది
పినాకః (స్త్రీ) శివునివిల్లు-శూలము.
పినాకీ (పు) శివుఁడు
పిప్పలః (పు) రావిచెట్టు - బాతు.
పిప్పలీ (స్త్రీ) పిప్పలిచెట్టు
పిప్పలీమూలమ్ (న) పిప్పలిదుంప.
పిపాసా (స్త్రీ) దప్పి
పిప్లుః (పు) పుట్టుమచ్చ.
పియాలః (పు) మొరటచెట్టు.
పియ్యూషమ్ (న) అమృతము.
పిల్లః (త్రి) పుశికట్టుకన్నులు.
పిశఙ్గః (త్రి) గోరోచనము
పిశాచః (పు) బేతాలాదిపిశాచగణము-
పిల్లి - శవము
పిశునః (త్రి) కొండెగాఁడు-నీచుఁడు
పిశునా (స్త్రీ) స్పృక్కయనెడు గ్రంధ్య
ము - కొండెబెండుచెట్టు.
పిష్టకః (పు) పిండివంటలు-కంటిరోగము
పిష్టపచనమ్ (న) బూరెలమూకుడు

పిష్టాతః (పు) బుక్కా.
పిసితమ్ (న) మాంసము.
పీఠమ్ (న) పీఁట.
పీడనమ్(న) } పీడనుఁగలఁగఁజేమట.
పీడా (స్త్రీ) }
పీతః (త్రి) త్రాగఁబడినది.
పీతకమ్ (న) హరిదలము [పు.
పీతద్రుః (పు) సరళపుచెట్టు- మానిపస
పీతనమ్ (న) కుంకుమము- హరిదలము.
పీతసాలకః (పు) పీతవర్ణ సాలవృక్షము
పీతా (స్త్రీ) పచ్చయిరుగుడుచెట్టు - పస
పు- మానిపసపు
పీతామ్బరమ్ (న) విష్ణువస్త్రము.
పీతిః (పు) గుఱ్ఱము-త్రాగడము.
పీనమ్ (న) సంతసము.
పీనసః (పు) పడిసెము. [ము.
పీనాహః(పు)కుశదర్భగడ్డి - పీనసరోగ
పీనోధ్నీ (స్త్రీ) పెద్దపొదుగుఁగలిగినయావు
పీయూషః (పు) ముఱ్ఱుఁబాలు-జున్నుఁ
బాలు.
పీలతి (ధా) ప-శప్ - పీలప్రతిష్టంభే -
నిరోధించుచున్నాఁడు.
పీలుః (పు) గోలుగుచెట్టు - ఏనుఁగు.
పీలుపర్ణీ (స్త్రీ) చాగచెట్టు- దొండచెట్టు.
పీవ (త్రి) బలిసినది.
పీవరస్తనీ (స్త్రీ) పెద్దపొదుగుఁగలయావు.
పుఙ్ఖః (పు) డేగ.
పుఙ్గవః (పు) శ్రేష్ఠచిహ్నవాచకము
పుచ్ఛః (స్త్రీ) తోఁక-వెనుకటిప్రక్క [శి
పుఞ్జః(పు) ఎలుక-ధాన్యముమొదలగురా
పుటభేదః (పు) కాలువ- చతుర్విధవా
ద్యము - నగరము.

పుటభేదనమ్ (న) పట్టణము.
పుండతి (ధా) ప- శప్ - పుడిఖండనే- ఖండనఁజేయుచున్నాఁడు.
పుణ్డరీకః (పు) ద్వితీయ్యదిగ్గజము - దిగ్గజము - పెద్దపులి- ఒకానొకము ని-పౌండరీకమనుయజ్ఞము- సాధారణమగుపేనుఁగు - చంద్రునివిల్లు - ఒకానొకచేప.
పుణ్డరీకాక్షః (పు) విష్ణువు- కుబేరుఁడు
పుణ్డర్యమ్(న)పుండరీయకమనుగ్రంధ్యము
పుణ్ద్రీ (పు) తెల్లచెఱకు - బొట్టు - పురుగు-పులి
పుణ్డ్రకః (పు) పువ్వులగురివెందతీఁగె
పుణ్యమ్ (న)ధర్మము-అంబు-సుకృతము
పుణ్యకమ్ (న) ఉపవాసరూపవ్రతము
పుణ్యజనః (పు) రాక్షసులు- యక్షులు.
పుణ్యజనేశ్వరః (పు) కుబేరుఁడు.
పుణ్యభూమిః (స్త్రీ) హిమవద్వింధ్యమధ్యదేశము
పుణ్యవాన్ (త్రి) ధన్యుఁడు-పుణ్యవంతుఁడు
పుత్తికా(స్త్రీ)మెట్టతోఁటకూర-తేనెటీగ
పుత్రః (పు) కొడుకు
పుత్రీ (స్త్రీ) కూతురు
పుత్రికా (స్త్రీ) మెట్టతోఁటకూర- తేనెటీగ - వస్త్రదంతకాష్టాదులచేఁ జేయఁబడినబొమ్మ - కూతురు
పునః (అ) రెండవసారి-అడుగుట- మరల-మఱియు
పునఃపునః (అ) మాటిమాటికి.
పున్థతి (ధా) ప- శప్ - హింసఁబడుచున్నాఁడు - దుఃఖమును బడుచున్నాఁడు.
పునర్నవా (స్త్రీ) గలిజేరుచెట్టు.
పునర్భవః (పు) సంసారము - గోరు.
పునర్భూః (స్త్రీ) మారుమనువుస్త్రీ
పున్నాగః (పు) సురపొన్నచెట్టు-పురుషశ్రేష్ఠుఁడు-తెల్లనిపాము - తెల్లఁగలువ
పుమాన్ (పు)మనుష్యుఁడు-పరమాత్మ-బ్రహ్మ-ఇంద్రుఁడు - కుబేరుఁడు- శివుఁడు
పురః (పు) గుగ్గిలపుచెట్టు - ఇల్లు - పట్టణము (అ) ఎదుట
పురతః (అ) ఎదుట-మొదట
పురద్వారమ్ (న) నగరద్వారము.
పురన్దరః (పు) ఇంద్రుఁడు- భుజము.
పురన్ధ్రీ (స్త్రీ) కుటుంబమునుఁబోషించెడియాఁడుది
పురస్కన్ధా (పు) చన్నులు
పురస్కృతః (త్రి) పగతునికై వశమైనది-తీసికొనఁబడినది-ఎదురుగఁజేయఁబడినది - పూజింపఁబడినది.
పురస్తాత్ (అ) మొదట- ఎదుట.
పురస్సరః (పు) శ్రేష్ఠుఁడు.
పురా (అ) వాక్యరచనఁజేయడము-పూర్వపుది - సమీపభవిష్యదర్థము - మొదటిది - వివాహము - గమనము- తరంగము
పురాణః (త్రి) పాఁతది
పురాతనః (త్రి) పూర్వపుకాలపుది.
పురావృత్తమ్ (న) తొల్లింటికథ
పురీ (స్త్రీ) పట్టనము-ఇల్లు - ఒడలు.
పురీతత్ (స్త్రీ) పేగు
పురీషమ్ (న) మలము

పురుః } (త్రి) అధికమైనది - గొప్పది.
పురుభూః }

పురుషః (పు) సాంఖ్యాకేవుఁడు - ఊరవా న్న - మనుష్యుఁడు - పరమాత్మ.

పురుషోత్తమః (పు) విష్ణువు - వారుఁడు

పురుహః } (త్రి) ఎక్కువది.
పురుహూః }

పురుహూతః (పు) దేవేంద్రుఁడు - మ న్మథుఁడు.

పురోగః } (త్రి) అగ్రేసరుఁడు - ముఖ్యునిముందునడుచువాఁడు.
పురోగమః }
పురోగామీ }

పురోధాః (పు) పురోహితుఁడు.

పులాకః (పు) సంక్షేపము - పొల్లు - అన్న కణము - చేప - మనోహరము - సుందరము.

పులినమ్ (న) ఇసుకదిన్నె అనఁగానీటివె లిసినపిదపఁగనబడు ఇసుకదిన్నె.

పులోమజా (స్త్రీ) దేవేంద్రునిభార్య, అనఁగాశచీదేవి.

పుల్కసః (పు) బోయవాఁడు - మాల వాఁడు - అధముఁడు.

పుంశ్చలీ (స్త్రీ) రంకులాడి.

పుషితః (త్రి) పోషించఁబడినది - బలిసినది.

పుష్కరమ్ (న) ఆకసము - ఉదకము - తమ్మి - పుష్కరమూలపుచెట్టు - ఏనుఁగుతొండముకొన - జగడము - మద్దెల మొదలగువాద్యములముఖ ము - ఔషదము - పిట్టగూఁడు.

పుష్కరః (పు) మద్దెల - పాము - యోగము - సంబంధము.

పుష్కరాహ్వాః (పు) సారిసపక్షి

పుష్కరిణీ (స్త్రీ) నలుచదరముగాఁద్రవ్వినబావి - తామరకొలను - ఆఁడుయేనుఁగు - కోనేరు.

పుష్కలః (పు) పొన్నచెట్టు - పుష్కలమను మేఘము - తీర్థము - నీరు - నాశములేనిది - వరుణునికొమరుఁడు

పుష్టః (త్రి) పోషింపఁబడినది.

పుష్పమ్ (న) వికసించుట.
(స్త్రీ) కుసుమము - ముట్టురక్తము - నెయ్యి - ఉదకము.

పుష్పకమ్ (న) కుబేరునివిమానము అనఁగారథము - రత్నకంకణము - నీలిచెట్టు - కంటివ్యాధి - కుంపటి.

పుష్పకేతుః (పు) మన్మథుఁడు.

పుష్పదన్తః (పు) వాయుదిగ్గజము.

పుష్పధన్వా (పు) మన్మథుఁడు.

పుష్పఫలః (పు) వెలగచెట్టు.

పుష్పరసః (పు) మకరందము.

పుష్పలిట్ (పు) తుమ్మెద.

పుష్పవతీ (స్త్రీ) ముట్టైనస్త్రీ.

పుష్పవన్తౌ (పు) సూర్యచంద్రులు.

పుష్పసమయః (పు) వసంతఋతువు.

పుష్యః (ద్వ) పుష్యమీనక్షత్రము - పుష్యమాసము - కలియుగము.

పుష్యరథః (పు) విష్ణువుయొక్క తేరు - ప్రయాణార్హమగురథము.

పుష్ణాతి (ధా) ప - శప్ - పోషించుచున్నాఁడు.

పూః (పు) వాయువు (స్త్రీ) పట్టణము - నిండించుట - శరీరము - ప్రోలు.

పూగః (పు) గంగరావిచెట్టు - పోఁకచెట్టు - సముదాయము

పూజా (స్త్రీ) పూజించుట
పూజితః (త్రి) పూజఁజేయఁబడినది.
పూజ్యః (పు) మామ (త్రి) పూజ్యుఁడు.
పూతః (త్రి) పవిత్రమయినది- తూర్పెత్తిన ధాన్యము మొదలయినవి- వడియఁబోసినది
పూతనా (స్త్రీ) కరకచెట్టు - జటామాంసి- పూతనయనురాక్షసి - కుబేరుని పట్టణము.
పూతికః } (పు) నెమలడుగుచెట్టు.
పూతికరజః }
పూతికాష్ఠమ్ (న) దేవదారువృక్షము.
పూతిగన్ధిః (త్రి) దుర్గంధము
పూతిదారు (న) దేవదారుచెట్టు.
పూతిఫలీ (స్త్రీ) కాలుగచ్చచెట్టు
పూపః (పు) పిండివంట
పూయతే (ధా) ఆ - శప్ - పూయీవిశరణేదుర్గంధేచ-విడిచిపోవుచున్నాఁడు - దుర్గంధముఁజేయుచున్నాఁడు. [యుట.
పూరః(పు) పోటు - వ్రణములనుశుద్ధిఁజే
పూరణీ (స్త్రీ) బూరుగచెట్టు-బంక.
పూరికా (స్త్రీ) పూరీలు.
పూరితః (త్రి) నింపింపఁబడినది.
పూరుషః (పు) మనుష్యసామాన్యము
పూర్ణమ్ (న) చెవులవరకు వింటినారిని లాగడము
పూర్ణః (త్రి)సమస్తము-నింపింపఁబడినది
పూర్ణకుమ్భః (పు) రాజద్వారమునందుంచఁబడినపూర్ణకలశము.
పూర్ణమాసః (పు) పున్నమనాఁడుఁజేయు యజ్ఞము
పూర్ణిమా (స్త్రీ) పున్నమ
పూర్తః (త్రి) నింపించినది-కప్పఁబడినది
పూర్వః (త్రి) మొదటిది- తూర్పుదిక్కునఁగాని, పూర్వకాలమునఁగాని, యున్నవస్తువు.
పూర్వజః (పు) అన్న.
పూర్వజా (స్త్రీ) అక్క
పూర్వదేవః (పు) రాక్షసకులము.
పూర్వపర్వతః (పు) తూర్పుకొండ
పూర్వేద్యుః (అ) తొలినాడు-నిన్న-తెల్లవారి.
పూషా (పు) పన్నిద్దరు సూర్యులలోనొకఁడు-సూర్యుఁడు
పృక్తిః (స్త్రీ) స్పర్శము, అనఁగాతాఁకుట
పృచ్ఛా (స్త్రీ) ప్రశ్న.
పృతనా (స్త్రీ) ౨౪౩-ఏనుఁగులు-౨౪౩-రథములు - ౭౨౯ - గుఱ్ఱములు- ౧౨౧౫-భటులుగలసేన.
పృథక్ (అ) గాక - అతిరిక్తము-నిందింపఁదగినపని - లేఁత.
పృథక్పర్ణీ (స్త్రీ) కోలపొన్న.
పృథగ్జనః (పు) అల్పుఁడు-మూర్ఖుఁడు
పృథగ్విధః (పు) అనేకవిధమయినది.
పృథివీ (స్త్రీ) భూమి
పృథుః (పు) పృథుడనువానరుఁడు-షోడశమహారాజులలోనొకండు.
పృథుకః (పు) శిశువు.
పృథురోమా (పు) చేఁప
పృథులః (త్రి) గొప్పది.
పృథ్వీ (స్త్రీ) పుడమి-చెలియలికట్ట- నల్లజీలకఱ్ఱచెట్టు
పృథ్వీకా (స్త్రీ) పెద్దయేలకులు

పృదాకుః (పు) పాము- తేలు- చిఱుతపు
లి - పులి.
పృశ్నిః (పు) కిరణము-బోయవాఁడు
(త్రి) మరుగుజ్జువాఁడు.
పృశ్నిపర్ణీ (స్త్రీ) కోలపొన్న.
పృషత్ (పు) ఇఱ్ఱి
పృషతః (పు) నీటిబిందువు - తెల్లమచ్చ
లుఁగలయిఱ్ఱి.
పృషత్కః (పు) బాణము.
పృషదంశకః (పు) పిల్లి.
పృషదశ్వః (పు) వాయువు.
పృషదాజ్యమ్ (న) నెయ్యిగలసిన పెరుగు.
పృష్ఠిః (త్రి) కత్తికయందుఁబుట్టినమధ్య
మస్వని.
పృష్ఠ్యః (పు) బరువుమోసెడు గుఱ్ఱము
పేచకః (పు) గుడ్లగూబ - ఏనుఁగతోక
మొదలు
పేటకః (పు) పెట్టె-గుంపు.
పేటతి (ధా) ప - శప్ - పిటశబ్దసంఘా
తయోః - శబ్దముచేయుచున్నాఁ
డు-పోగుచేయుచున్నాఁడు.
పేటా (స్త్రీ) పెట్టె
పేతతి (ధా) ప-శప్ - పిగహింసాసంక్లే
శనయోః-హింసఁజేయుచున్నాఁ
పేడా (స్త్రీ) పెద్దపెట్టె. [డు
పేలవః (త్రి) మెత్తనిది- వెలితిగలబట్ట
మొదలయినది
పేలీ (పు) గుఱ్ఱము
పేవతే (ధా) ఆ-శప్-పేవృ శేవసే - సే
వించుచున్నాఁడు.
పేశలః (పు) శరీరముదాచనిబం టు-రో
క లి-కోయుబ-హాటుఁడు

పేశీ (స్త్రీ) గ్రుడ్డు - జటామాంసి - కత్తి
యొర - మాంసపిండము
పేశికోశః (పు) గ్రుడ్డు
పైఠరః (త్రి) కుండనుఎండినపిండివంట.
పైతృష్వసేయః }
పైతృష్వస్రీయః } (పు) మేనత్తకొడుకు
పోగణ్డః (త్రి) ఎనిమిదేండ్లబాలుఁడు-
అంగములేనివాఁడు.
పోటగలః(పు)కిక్కిసగడ్డి-మీను-జెల్లు.
పోటా (స్త్రీ) స్త్రీపురుష లక్షణములుగల
స్త్రీ-వేశ్య
పోతః (పు) శిశువు- వస్త్రము-ఏఱుదా
టెడిఓడ
పోతవణిక్ (పు) ఓడ కేవునుఁ బుచ్చుకొ
నినవాఁడు
పోతవహః }
పోతవాహః } (పు) ఓడతండేలు
పోత్రమ్ (న) నాగటిమొన-పందిముట్టె.
పోత్రీ (పు) అడవిపంది-ఎనుము.
పౌణ్డర్యమ్(న) పుండరీయకమనుగ్రంథ్య
పౌణ్డ్రమ్ (న) మన్మథునివిల్లు [ము
పౌతవమ్ (న)తూనికెగుండ్లు మొదలైనవి
పౌత్రీ (స్త్రీ) కొడుకుకూఁతురు-కూఁతురు
కూఁతురు.
పౌరమ్ (న) కామంచిగడ్డి
పౌరస్త్యః (త్రి) మొదటిది
పౌరుషః (త్రి) మనిషిచెయ్యెత్తుపొడుగు
పౌరోగవః (త్రి) వంటవాఁడు
పౌర్ణమాసః (పు) సోమయాజి
పౌర్ణమాసీ (స్త్రీ) పున్నమ.
పౌలస్త్యః (పు)కుబేరుఁడు- రావణుఁడు-
విభీషణుడు

పౌషః (పు) పుష్యమాసము- ఉత్సవము- జగడము

పౌషీ(స్త్రీ) పుష్యమాసముయొక్క- పున్నమ

ప్యాయతే (ధా) అ - శప్ - ప్యాయీ వృద్ధౌ- వృద్ధిఁబొందు మన్నాఁడు

ప్రః (అ) జడ

ప్రకాణ్డః (పు) కొమ్మలక్రిందిమ్రానులోఁ క్రిందిభాగము

ప్రకామమ్ (న) యథేష్టమైనది

ప్రకారః (పు) భేదము - ఉపమానము- దృష్టాంతము-పోలిక

ప్రకాశః (పు) ఎండ కాంతి- తిగణము

ప్రకీర్ణకమ్ (న) మురటి- వెడల్పు-గుత్తము.

ప్రకీర్యః (పు) నెమలడుగుచెట్టు

ప్రకృతిః (స్త్రీ) ప్రధానము- స్వభావము- ఇరువదొకటి-రాజ్యసప్తాంగము- పురజనులు, అనఁగా జాకలి, అగసాలి మొదలగువారు - పృథివి- అప్, తేజస్సు, వాయువు, ఆకాశములు - భగము-తల్లి

ప్రకోష్ఠః (పు) ముంజెయ్యి - చోపా

ప్రక్రమః (పు) కార్యముతొలుఁతనారంభించుట-సమము-క్రమము.

ప్రక్రియా (స్త్రీ) అధికారము.

ప్రక్వాణః
ప్రక్వాణః } (పు) వీణాధ్వని.

ప్రగణ్డః (పు) జెబ్బ.

ప్రగతజానుకః(త్రి) దొడ్డికాలులవాఁడు

ప్రగల్భః (త్రి) అప్పటప్పటికి ప్రకాశించెడుబుద్ధిఁగలవాఁడు.

ప్రగాఢః (పు) కష్టము-దృఢము

ప్రగుణః (త్రి) తిన్ననిది (పు) నాశము

ప్రగే (అ) ప్రాతఃకాలము.

ప్రగ్రహః (పు) కిరణము- కొండచెట్టు-కళ్లెమునుగ్రిచ్చిరాతు పట్టుకొను లగాము - ఖైదుచేయఁబడిన స్త్రీ పురుషాగులు- ఖైదుచెయ్యడము- తక్కెడనాధితాడు - పూజ-తలఁపుగడియ - భుజము- బంగారము-మానివసవు - త్రాసు.

ప్రఘణః (పు) ఇంటిచోపా- రాగిబింజె- ఇనుపగుదియ-ఋషి్యాశ్రమతోట.

ప్రచక్రమ్ (త్రి) కదలినదండు

ప్రచలాయితః (త్రి) కునికిపాట్లుఁబడెడువాఁడు

ప్రచురమ్ (త్రి) అధికమయినది.

ప్రచేతసః (పు) వరుణుఁడు

ప్రచోదనీ(స్త్రీ) వాకుడుచెట్టు-సంగడి-

ప్రచ్ఛర్దికా (స్త్రీ) వాంతి [తెడ్డు.

ప్రచ్ఛదపటః (పు) గవుసెన-పరుపుపైని పరచెడుపచ్చడము- గౌసెన.

ప్రచ్ఛన్నమ్ (న) ఇంటిలోపలనుండు ద్వారము

ప్రజనః (పు) ఎద్దుపై గొనడము- చూలుకట్టెడుకాలము

ప్రజవీ (పు) శీఘ్రముగాఁబోవువాఁడు.

ప్రజా (స్త్రీ) బిడ్డ-జనులు.

ప్రజాతా (స్త్రీ) బిడ్డఁగన్నయాఁడుది,

ప్రజాపతిః (పు) బ్రహ్మ- ప్రజాపతిసంవత్సరము-శిశ్నము- రాజు- అగ్ని- అల్లుఁడు-సూర్యుఁడు- విశ్వకర్మ

ప్రజాపతీ (స్త్రీ) అన్నభార్య

ప్రజ్ఞః (త్రి) పంగటికాళ్లవాఁడు- పండితుఁడు సమర్థుఁడు.

ప్రజ్ఞా (స్త్రీ) బుద్ధి-లౌకికవైదికవ్యవహారములు తెలిసినమగువ-వాణి.

ప్రజ్ఞానమ్ (న)గుఱుతు-తెలివి-పరబ్రహ్మ

ప్రడీనమ్ (న)మీదినుండిక్రిందికిదిగడము

ప్రణయః (పు) ప్రీతిచేతఁబ్రార్థించుట-మంచిమాటలాడుట.

ప్రణవః (పు) ఓంకారము.

ప్రణాదః (పు) ఉత్సాహమువలనఁ బుట్టినశబ్దము - గట్టిగానఱచుట-చెవియందుఁబుట్టినరోగము.

ప్రణాలః(పు) } కాలువతూము
ప్రణాలీ (స్త్రీ) }

ప్రణిధిః (పు) వేడుట- వేగులవాఁడు.

ప్రణిహితః (త్రి) పొందఁబడినది-ఉంచబడినది

ప్రణీతః(త్రి)వండినయన్నము మొదలైనది

ప్రణుతః (త్రి) స్తోత్రముఁజేయబడినది.

ప్రణేయః (త్రి) కొత్తది.

ప్రతనః (త్రి) పూర్వపుది.

ప్రతలః (పు) చాచిన వ్రేళ్లుగల అఱచెయ్యి-క్రిందిలోకము.

ప్రతాపః (పు) కోశదండము వలనఁబుట్టినతేజస్సు-పరాక్రమము- ఎండ.

ప్రతాపనః (పు) తెల్లజిల్లేడు.

ప్రతి (అ) సదృశము-ప్రతిది-చిహ్నము-మార్పుట - భాగము.

ప్రతికర్మ (న) సువర్ణవస్త్రమాల్యాదులచేతనొప్పినది.

ప్రతికూలః (త్రి) ప్రతికూలమయినది.

ప్రతికృతిః (స్త్రీ) విష్ణువినాయకాది ప్రతిమలు-పూజించుట- ప్రతిక్రియఁజేయుట,అనఁగాఁబగం దీర్చుట.

ప్రతికృష్టః (త్రి) నీచుఁడు.

ప్రతిక్షిప్తః (త్రి) ఆక్షేపింపఁబడినవాఁడు-పంపఁబడినవాఁడు.

ప్రతిగ్రాహః (పు) పీకుదాను

ప్రతిఘః(పు)కోపము-పగఁదీర్చుకొనుట.

ప్రతిఘాతనమ్ (న) చంపుట.

ప్రతిచ్ఛాయా (స్త్రీ) విష్ణువినాయకాదిప్రతిమలు.

ప్రతిజాగరః (పు) పూర్వమనుభవించినదానినిమరలఁగోరడము

ప్రతిజ్ఞాతః (త్రి) అంగీకరింపఁబడినది.

ప్రతిజ్ఞానమ్ (న) అంగీకారము.

ప్రతిదానమ్ (న) దాఁచఁబెట్టినది - తిరుగానిచ్చుట.

ప్రతిపత్ (స్త్రీ) బుద్ధి-ప్రథమతిథి.

ప్రతిపన్నః (త్రి) తెలియఁబడినది.

ప్రతిపాదనమ్ (న) ఈవి.

ప్రతిబన్ధః (పు) అడ్డగించుట- విఘ్నము.

ప్రతిబిమ్బమ్ (న) } విష్ణువు మొదలయి
ప్రతిమా (స్త్రీ) } నవారిమూర్తులకుస
ప్రతియాతనా(స్త్రీ) } మముగా శిలాదుల
చేఁజేసినబొమ్మ.

ప్రతిరోధీ (పు) దొంగ.

ప్రతివాక్యమ్ (న) మాఱుమాట.

ప్రతిశ్యాయః (పు) పడిశము.

ప్రతిశ్రయః (పు) సభ - ఉనికిపట్టుగృహము.

ప్రతిష్టంభః (పు) కార్యవిఘాతము.

ప్రతిసీరా (స్త్రీ) తెర-పరదా.

ప్రతిహతః (త్రి) దుర్భాగ్యుఁడు

ప్రతిహారః (పు) ద్వారపాలకుఁడు

ప్రతిహారకః (పు) గారడీవాఁడు.

ప్రతిహాసః (పు) గన్నేరుచెట్టు.
ప్రతీకః (త్రి) ప్రతికూలము.
ప్రతీక్ష్యః (త్రి) పూజ్యుఁడు.
ప్రతీచీ (స్త్రీ) పడమటదిక్కు.
ప్రతీరమ్ (న) గట్టు
ప్రతీహారః(పు)వాకిలి-ద్వారపాలకుఁడు.
ప్రతీహారీ (త్రి) వాకిలిఁగాచెడు స్త్రీ)
ప్రతోలిః (స్త్రీ) రథములు పోవువీధి.
ప్రత్నః (త్రి) పూర్వకాలపుది.
ప్రత్యక్ (అ) పడమటిదిక్కు - పడమటిదేశము.
ప్రత్యక్శ్రేణీ (స్త్రీ) ఎలుకచెవిచెట్టు.
ప్రత్యక్పర్ణీ / ప్రత్యక్పుష్పీ } (స్త్రీ) ఉత్తరేణిచెట్టు.
ప్రత్యక్షః (త్రి) ఇంద్రియగోచరమైనది
ప్రత్యగ్రః (త్రి) నూతనము.
ప్రత్యయః (పు) నమ్మిక - విశ్వాసము - హేతువు.
ప్రత్యయితః (త్రి) నమ్మినసఖుఁడు.
ప్రత్యర్థీ (త్రి) శత్రువు.
ప్రత్యవసితః (త్రి) భుజింపఁబడినది
ప్రత్యాఖ్యాతః (త్రి) న్యాయముచేతఁబరిహరింపఁబడినవాఁడు.
ప్రత్యాఖ్యానమ్(న) / ప్రత్యాదేశః (పు) } తిరస్కరించుట
ప్రత్యాలీఢమ్ (న) ఎడమకాలు ముందుకుచాచినిలుచుట.
ప్రత్యాహారః (పు) విషయములవలననింద్రియములనుమరలించుట
ప్రత్యుత్క్రమః (పు) యుద్ధమునకుఘటులు వెడలుట.
ప్రత్యూషః (న) ఉషఃకాలము

ప్రత్యూహః (పు) విఘ్నము.
ప్రధనమ్ (న) యుద్ధము.
ప్రథమః (త్రి) మొదటిది-ముఖ్యమైనది.
ప్రథా (స్త్రీ) ప్రసిద్ధి.
ప్రథితః (త్రి) గుణాదులచేతఁ బ్రసిద్ధుడైనవాఁడు
ప్రదరః (పు) బాణము-రోగము.
ప్రదీపః (పు) దీపము.
ప్రదీపనః (పు) విషభేదము.
ప్రదేశనమ్ (న) కానుక.
ప్రదేశినీ (స్త్రీ) జుట్టనవ్రేలు.
ప్రదోషః(పు) దోషకాలము-మన్మథుఁడు
ప్రద్యుమ్నః (పు) మన్మథుఁడు.
ప్రద్రవః / ప్రద్రావః } (పు) పాఱిపోవడము.
ప్రధానః (స్త్రీ) మంత్రి-ముఖ్యుఁడు.
ప్రపఞ్చః (పు) వైపరీత్యము- విస్తారము.
ప్రపదమ్ (న) మీఁగాలు.
ప్రపా(స్త్రీ)చలిపందిరి, అనఁగాజలివేంద్రి
ప్రపాతః (పు) కొండచరియ.
ప్రపితామహః (పు) ముత్తాత.
ప్రపితామహీ (స్త్రీ) ముత్తవ్వ.
ప్రపున్నాటః (పు) తగిరిసెచెట్టు.
ప్రపౌణ్డరీకమ్ (న) పుండరీకమనుగంధద్రవ్యము.
ప్రఫుల్లః (త్రి) వికసించినది.
ప్రబన్ధకల్పనా (స్త్రీ) ప్రబంధకథ.
ప్రబర్హః (త్రి)ప్రధానమయినవాఁడు-శ్రేష్ఠమయినది
ప్రబోధనమ్ (న) పరిమళతైలము.
ప్రభఞ్జనః (పు) వాయువు.
ప్రభవః (పు) జననమునకుకారణమయినది-ప్రభవసంవత్సరము.

ప్రభా (స్త్రీ) తేజస్సు -జ్వాల- కుబేరునిప ట్టణము-సూర్యునిభార్య.
ప్రభాకరః (పు) సూర్యుఁడు-అగ్ని- చం ద్రుఁడు-సముద్రుఁడు
ప్రభాతమ్ (న) ప్రాతఃకాలము.
ప్రభావః (పు) కోశదండములవలనఁబు ట్టిన తేజస్సు,అనఁగాఁ ప్రభుశక్తి
ప్రభిన్నః (పు) మదపుటేనుఁగు
ప్రభుః (పు) దేవుఁడు-సమర్థుఁడు- ఒక గ్రామమునకధికారి.
ప్రభూతః (త్రి) అధికమైనది.
ప్రభ్రష్టకమ్ (న) సిగనువ్రేలెడిపూలదండ
ప్రమదః (పు) సంతోషము.
ప్రమదవనమ్ / ప్రమదావనమ్ (న) అంతఃపురమునకు నుచితమైనరాజుతోట
ప్రమదా (స్త్రీ) మదించినస్త్రీ - గర్వించిన స్త్రీ
ప్రమా (స్త్రీ) నిజముగా నఱుఁగుట.
ప్రమాణమ్ (న) మర్యాద-ప్రత్యక్షాదిజ్ఞానకారణము - శాస్త్రము-జేన, మూరమొదలయినది.
ప్రమాతామహః (పు) తల్లియొక్క తండ్రితండ్రి
ప్రమాదః (పు) తప్పడము.
ప్రమాపణమ్ (న) చంపడము.
ప్రమీతః (త్రి) యజ్ఞమందుహింసింపం బడినపశువుమొదలయినవి- చని పోయినవాఁడు
ప్రమీలా (స్త్రీ) కునికిపాటు.
ప్రముదితః (త్రి) సంతోషించినవాఁడు.
ప్రమోదః (పు) ఆనందము.
ప్రయతః (త్రి) పవిత్రుఁడు.
ప్రయామః (పు) ఎక్కువతక్కువలేకుం డాపలకడము
ప్రలమ్బఘ్నః (పు) బలరాముఁడు.
ప్రలయః (పు) సొమ్మసిలుట-చావు.
ప్రలాపః (పు) అక్కఱలేనిమాట.
ప్రవణః(పు)నాలుగుతోవలుగలసినదారి
ప్రవయాః (త్రి) ముసలివాఁడు.
ప్రవహణమ్ (న) అందలముమొదలైనది
ప్రవారణమ్ (న) ఫలమునపేక్షించిదాన మిచ్చుట.
ప్రవాలః (పు) వీణదండె.
ప్రవాసనమ్ (న) చంపడము.
ప్రవాహః (పు) ప్రవహించడము.
ప్రవాహికా (స్త్రీ) గ్రహణిసంకటము.
ప్రవిఖ్యాతిః (స్త్రీ) అతిప్రసిద్ధి.
ప్రవిదారణమ్ (న) జగడము.
ప్రవిశ్లేషః (పు) ఎడబాయుట.
ప్రవీణః (త్రి) నేర్పరి.
ప్రవృత్తిః (స్త్రీ) వృత్తాంతము- ఎడతెగని ప్రవాహము.
ప్రవృద్ధః (త్రి) వృద్ధిబొందినది - ఆదోక గాఁబెరిగినది
ప్రవేకః (పు) ప్రధానవస్తువు.
ప్రవేణిః / ప్రవేణీ (స్త్రీ) సర్పాకారముగానల్లినజడ-ఏనుఁగుమీఁదఁబరిచెడిచిత్రకంబళము.
ప్రవేష్టః (పు) భుజము.
ప్రవ్యక్తమ్ (త్రి) స్ఫుటమయినది.
ప్రశస్తః (త్రి) ప్రసిద్ధుఁడు.
ప్రశ్నః (పు) అడగడము.
ప్రశ్రయః (పు) ఓదార్పడము-అడుగకొనుట
ప్రష్ఠః (త్రి) ముందరనడిచెడువాఁడు.

ప్రష్ఠవాట్ (పు) క్రొత్తకాడిక్రిందఁదోలినయెద్దు
ప్రష్ఠౌహీ (స్త్రీ) తొలిచూలుపెయ్యి-పెయ్య-పడ్డ.
ప్రసన్నః (త్రి) } నిర్మలవస్తువు.
ప్రసన్నతా (స్త్రీ) }
ప్రసన్నా (త్రి) కల్లు.
ప్రసభమ్ (అ) } బలాత్కారము.
ప్రసభః (స్త్రీ) }
ప్రసరః (పు) వ్యాపించడము.
ప్రసరణమ్ (న) } సేనయంతటా వ్యాపించుట.
ప్రసరణీ (స్త్రీ) }
ప్రసవః (పు) ఋతుమూతి - పుష్పము-ఫలము-పుట్టుక - బిడ్డనుగనుట
ప్రసవబన్ధనమ్ (న) తొడిమె
ప్రసవ్యః (త్రి) ప్రతికూలమైనది-ఎడమది.
ప్రసహ్య (అ) బలాత్కారముగా.
ప్రసాదకః (పు) కుంకుడుచెట్టు.
ప్రసాధనమ్ (న) సువర్ణవస్త్రమాల్యాదులచేతనయినయొప్పిదము.
ప్రసాధనీ (స్త్రీ) దువ్వెన.
ప్రసాధితః (త్రి) అలంకరింపబడినవాఁడు
ప్రసారణీ (స్త్రీ) గొంతెమగోరుచెట్టు.
ప్రసారీ (స్త్రీ) వాయులోకము.
ప్రసితః (త్రి) ఒకపదార్థమునందు మనస్సుఁగలవాఁడు.
ప్రసితిః (స్త్రీ) కట్టుసాధనము.
ప్రసిద్ధః (త్రి) ఖ్యాతిగలవాఁడు-అలంకరింపఁబడినవాఁడు.
ప్రసూః (స్త్రీ) తల్లి-తీగె-అడుగుఁజిమ.
ప్రసూతా } (స్త్రీ) బిడ్డలనుగనెడి స్త్రీ-బాలింతరాలు.
ప్రసూతిః }
ప్రసూతికా }

ప్రసూనమ్ (న) పుష్పము - ఫలము.
ప్రసృతా (స్త్రీ) పిక్క.
ప్రసృతిః (స్త్రీ) పుడిసెడు-చేరెడు.
ప్రసేవకః (పు) వీణాకాయముఖమందుండెడికఱ్ఱ.
ప్రస్తరః (పు) పాషాణము - మణి.
ప్రస్తావః (పు) అవసరము.
ప్రస్థః (పు) కుంచెడు
ప్రస్థపుష్పః (పు) మరువము
ప్రస్థానమ్ (న) ప్రయాణము.
ప్రస్ఫోటనమ్ (న) చేట.
ప్రస్రవణమ్ (న) ఊటనీఱు.
ప్రస్రావః (పు) మూత్రము.
ప్రహరః (పు) జాము
ప్రహరణమ్ (న) ఆయుధము.
ప్రహస్తః (పు) చాచినఅఱచెయ్యి.
ప్రహిః (పు) నుయ్యి.
ప్రహేలికా (స్త్రీ) గూఢార్థప్రబంధము.
ప్రహ్లన్నః (త్రి) సంతోషించినవాఁడు.
ప్రాంశుః (త్రి) పొడుగైనది.
ప్రాక్ (అ) గడచినకాలము- తూర్పుదిక్కు-తూర్పుదేశము.
ప్రాకారః (పు) కోట
ప్రాకృతః (త్రి) అల్పుఁడు.
ప్రాగ్రహరః } (త్రి) ప్రధానమయినది
ప్రాగ్ర్యః }
ప్రాగ్వంశః (పు) యజ్ఞశాలాప్రాంతగృహము.
ప్రాఘూరః (పు) కారుట.
ప్రాచీ (స్త్రీ) తూర్పు-పచ్చాకుచెట్టు
ప్రాచీనమ్ (న) ఊరిచుట్టువేసినవెలుఁగు.
ప్రాచీనా (స్త్రీ) పాటచెట్టు.

ప్రాచీనావీతమ్ (న) అపసవ్యముగా వేసికొనినజంజెము
ప్రాచీరమ్ (న) ఈఁకిచుట్టు వేసిన వెలుఁగు
ప్రాజనమ్ (న) ములుకోల
ప్రాజ్ఞః (పు) విద్వాంసుఁడు
ప్రాజ్ఞా (స్త్రీ) ఎక్కువబుద్ధిగల స్త్రీ
ప్రాజ్ఞీ (స్త్రీ) లౌకికవ్యవహారములయందు నిక్కిలియెఱుకగల స్త్రీ
ప్రాజ్యః (త్రి) ఎక్కువది
ప్రాడ్వివాకః (పు) తగవరి.
ప్రాణః (పు) బలిమి - ప్రాణము - బ్రహ్మ - అగ్ని.
ప్రాణిద్యూతమ్ (న) కోళ్లు, గొఱ్ఱెలు, పిగిలిపిట్టలు మొదలయినవాటిజూదము
ప్రాణీ (పు) మనుష్యాదిజంతువు.
ప్రాతః (అ) ప్రాతఃకాలము.
ప్రాతిహారః / ప్రాతిహారకః (పు) గారిడీవాఁడు.
ప్రాథమకల్పికః (పు) క్రొత్తగావిద్యనారంభించినశిష్యుఁడు.
ప్రాదుః (అ) నామధేయము-సంభావన-ప్రకాశించునది.
ప్రాదేశః (పు) లాడితెడు.
ప్రాదేశనమ్ (న) ఇచ్చుట.
ప్రాధ్వమ్ (అ) అనుకూలము-నమ్రము.
ప్రాన్తరమ్ (న) సమీపమార్గము - పొలిమేర.
ప్రాప్తః (త్రి) కూడుకొనినది- పొందఁబడినది
ప్రాప్తపఞ్చత్వమ్ (త్రి) చచ్చినవాఁడు
ప్రాప్తరూపః (త్రి) విద్వాంసుఁడు.

ప్రాప్తిః (స్త్రీ) లాభము - పొందుట.
ప్రాప్యః (త్రి) పొందఁదగినది.
ప్రాభృతమ్ (న) కానుక.
ప్రాయః (పు) సర్వసంగపరిత్యాగము తోఁగూడుకొని ప్రాణత్యాగము కొరకు నాహారము లేకయుండుట-బాహుళ్యము.
ప్రాయః (అ) తరుచుగా
ప్రార్థితః (అ) యాచింపఁబడినది.
ప్రాలమ్బమ్ (న) పేరుగావేసుకొనిన పూలదండ.
ప్రాలమ్బికా (స్త్రీ) పేరులు- గొలుసులు.
ప్రాలేయమ్ (న) మంచు
ప్రావారః (పు) పైబట్ట
ప్రావృతః (త్రి) కప్పుకొనుబట్ట
ప్రావృషా (స్త్రీ) వర్షఋతువు
ప్రావృషాయణీ (స్త్రీ) దూలగొండిచెట్టు.
ప్రాసః (పు) ఈఁటె.
ప్రాసఙ్గః (పు) ఎద్దులకు, గుఱ్ఱములకు మెడక్రింది రెండవకాఁడి.
ప్రాసఙ్గ్యః (పు) తలకాఁడి, మెడక్రింది రెండవకాఁడిఁబూనినయెద్దు
ప్రాసికః (పు) ఈఁటెపట్టెడువాఁడు,
ప్రియః (పు) మగఁడు- ఇష్టమగువస్తువు.
ప్రియఙ్గు (న) కుంకుమము
ప్రియఙ్గుః (స్త్రీ) ప్రేంకణపుచెట్టు - కొఱ్ఱలు-పిప్పళ్లు - నల్లని ఆవాలు.
ప్రియంవదా (స్త్రీ) జాజిచెట్టు
ప్రియాలః (పు) మొరలిచెట్టు
ప్రీణనమ్ (న) తృప్తిఁబొందించుట.
ప్రీతిః (స్త్రీ) సుఖము
ప్రుష్టః (త్రి) కాల్పఁబడినది

ప్రేక్షా (స్త్రీ) గుఱ్ఱములగతిభేదము - రతి బంధవిశేషము.
ప్రేక్షితః (త్రి) కదిలించఁబడినది.
ప్రేతః (పు) నరకమునందుండువాఁడు- (త్రి) చచ్చినవాఁడు.
ప్రేత్య (అ) మరణానంతరమందయ్యెడి శరీరపరిగ్రహము.
ప్రేమ (న) స్నేహము
ప్రేష్యః (పు) బంటు,అనఁగాజీతగాఁడు
ప్రైసః (పు) పీడించుట.
ప్రోక్షః (స్త్రీ) గుఱ్ఱపుముక్కు - నదుము- స్త్రీగర్భము.
ప్రోషః (పు) కాల్చుట
ప్రోక్షణమ్ (న) } యజ్ఞమునందు చంపఁబడిన పశు
ప్రోక్షితః (త్రి) } వధ
ప్రోఢః (త్రి) వృద్ధిబొందినది
ప్రోష్ఠపదః (పు) భాద్రపదమాసము
ప్రోష్ఠపదా (స్త్రీ)పూర్వాభాద్రనక్షత్రము
ప్లవః (పు) తెప్ప-కప్ప - నీటికోడి - మాలవాఁడు
ప్లవగః (పు) కప్ప - కోతి.
ప్లవంగః (పు) కోతి
ప్లవంగమః (పు) కోతి - కప్ప.
ప్లక్షః (పు) ఏడుదీవులలోనొకటి- జువ్విచెట్టు - రావిచెట్టు
ప్లుష్టః (త్రి) కాల్చఁబడినది.
ప్లోషః (పు) కాల్చుట.

ఫ

ఫః (పు) సర్పముతోఁజేసిన పెనుగాలి-భుజముఁదట్టుట - నివారించుట - యొుగము
ఫక్కతి (ధా) ప ... - మెల్లగా వచ్చు ... చున్నాఁడు - చెడుగావ్యవహరించుచున్నాఁడు.
ఫట్ (అ) విఘ్నము.
ఫణా (స్త్రీ) పాముపడగ.
ఫణాకరః } (పు) పాము.
ఫణాధరః }
ఫణాభృత్ } (పు) పాము.
ఫణావాన్ }
ఫణీ (పు) పాము.
ఫణిజ్జకః } (పు) మరువము-తులసి.
ఫణిర్జకః }
ఫలమ్ (న) పండు-తక్కోలఫలము- జాజికాయ - డాలు - పైరు.
ఫలకమ్ (స్త్రీ) డాలు.
ఫలకపాణిః (పు) డాలుపట్టెడువాఁడు.
ఫలపూరః (పు) మాదిఫలపుచెట్టు.
ఫలాధ్యక్షమ్ (న) పాలచెట్టు.
ఫలినః (త్రి) పనసచెట్టు
ఫలినీ (స్త్రీ) ప్రేంకణపుచెట్టు.
ఫలేరుహా (స్త్రీ) కలిగొట్టుచెట్టు.
ఫల్గు (స్త్రీ) బ్రిహ్మమేడిచెట్టు.
ఫా (స్త్రీ) కఠినోక్తి - ఆట - గుడిసె.
ఫాట్ (అ) ఓయి
ఫాణ్ట (త్రి) ప్రియాసములేకుండాచేసిన కిసాయాదికము.
ఫాణితమ్ (న) కండచక్కెర.
ఫాల్గునః } (పు) ఫాల్గునమాసము
ఫాల్గునికః }
ఫుల్లః (త్రి) వికసించినది.
ఫేనః (పు) నురుగు-సముద్రఫేనము.
ఫేనిలః (పు) కుంకుడుచెట్టు.
ఫేరండః } (పు) నక్క.
ఫేరుః }

### బ

బన్ (న) కలహము - గర్వము.

బః (పు) కడవ - వరుణుఁడు-బిందువు-వికల్పము-గురువు-మదము - కలహము-గర్భము.

బకః (పు) వాలుకొంగ-కుబేరుఁడు- రాక్షసుఁడు-బకపుష్పము

బడబా (స్త్రీ) ఆడుగుఱ్ఱము- ద్విజుల స్త్రీ)

బడబానలః (పు) బడబాగ్ని.

బడిశమ్ (న) గాలము

బణతి (ధా) ప-శప్ - బణశబ్దార్థే-ధ్వనిజేయుచున్నాఁడు.

బత (అ) ఓయియనుట - అయ్యోయనుట - అయ్యయ్యో - అన్నా-జౌరా.

బదతి (ధా) ప-శప్ - స్థిరముగానుంచున్నాఁడు

బదరః (పు) రేగుచెట్టు.

బదరా (స్త్రీ) ప్రత్తిచెట్టు.

బదరీ (స్త్రీ) రేగుచెట్టు - ప్రత్తిచెట్టు.

బధిరః (త్రి) చెవిటివాఁడు

బన్దీ (స్త్రీ) ఖైదుఁజేయఁబడినవాఁడు-ఖైదుఁజేయడము.

బన్ధః (పు) తాకట్టు

బన్ధకీ (స్త్రీ) జారత్వముఁగలది - ఆఁడు ఏనుఁగు

బన్ధనమ్ (న) కట్టివేయుట- బొండ-సంకెళ్లచేతఁజేసినకయిదు.

బన్ధనాలయః (పు) చెరసాల.

బన్ధనీ (స్త్రీ) జిబిలికచెట్టు

బన్ధుః (పు) సగోత్రుఁడు-స్నేహితుఁడు. మగఁడు (స్త్రీ) భార్య

బన్ధుజీవకః (పు) మంకెనచెట్టు.

బన్ధుతా (స్త్రీ) బంధుసమూహము.

బన్ధురః (త్రి) పొగుగుఁగలిగి వంగినది = వంగినది

బన్ధులః (పు) రంకులాడికొడుకు.

బన్ధూకః (పు) వేగిచెట్టు

బభ్రుః (పు) నకులుఁడు-శివుఁడు- విష్ణువు-గొప్పముంగిస

బమ్భరః (పు) తుమ్మెద

బర్కరః (పు) ప్రాయపువయస్సుగలపశువు.

బర్బతి (ధా) ప-శప్-బర్బగతౌ- పోవుచున్నాఁడు

బర్బరః (పు) చిలుతేకుచెట్టు-బొబ్బర్లు.

బర్బరా (స్త్రీ) వాయింటచెట్టు.

బర్హమ్ (న) స్థౌణేయమనుగ్రంథ్యము-ఆకునెమలిపింఛము

బర్హపుష్పమ్ }
బర్హిపుష్పమ్ } (న) స్థౌణేయమను గ్రంథ్యము

బర్హిణః (పు) నెమలి

బర్హిర్ముఖః (పు) దేవతలు.

బర్హిష్ఠమ్ (న) కురువేరు.

బర్హీ (పు) నెమలి

బలమ్ (న) సేన - సందు - బలిమి.

బలః (పు) బలరాముఁడు

బలదేవః }
బలభద్రః } (పు) బలరాముఁడు.

బలభద్రికా (స్త్రీ) కలుకాప్రినుఁగుచెట్టు.

బలవత్ (అ) లెస్స-మిక్కిలి

బలవాన్ (త్రి) బలిసినవాఁడు.

బలవిన్యాసః (పు) వ్యూహమునొడ్డుట.

బలా (స్త్రీ) కతివేఁగొట్టు-[illegible]- పింవలెన్న గములువయస్సుగల స్త్రీ)

బలాకా (స్త్రీ) తెల్లకొక్కెరచెట్టు.
బలాత్కారః (పు) బలవంతము.
బలారాతిః (పు) ఇంద్రుఁడు.
బలాహకః (పు) మేఘము.
బలిః (పు) పన్ను - బలిచక్రవర్తి.
బలిధ్వంసీ (పు) విష్ణువు.
బలిపుష్టః } బలిభుక్ } (పు) కాకి - కొంగ.
బలిసద్మ (న) చతుర్థాధోలోకము.
బలీవర్దః (పు) ఎద్దు
బష్కయణీ (స్త్రీ) తడవుగానీనినయావు- అఱునెలలదూడగలయావు.
బస్తః (పు) మేకపోతు
బస్తకమ్ (న) రుమాకరజాతలవణము.
బహిః (అ) వెలుపట,
బహిర్ద్వారకమ్(న) తలవాకిలి.
బహుః (త్రి) ఎక్కువగు.
బహుకరః (త్రి) కళ్లముబాగుఁజేసెడివాఁడు.
బహుకరీ (స్త్రీ) చీపురు
బహుగర్హ్యవాక్ (త్రి) తరుచుమాటలాడువాఁడు
బహుధా (అ) అనేకవిధములుగాను.
బహుపాత్ (పు) మఱ్ఱిచెట్టు.
బహుప్రదః(త్రి) చాలాయిచ్చెడువాఁడు
బహురూపః (పు) యక్షధూపము- శివుఁడు-విష్ణువు - బ్రహ్మ.
బహులః (పు) అగ్ని - కృష్ణపక్షము - అర్జునుఁడు.
బహులా (స్త్రీ) కృత్తికనక్షత్రము - పెద్దయేలకులు- గోవు - చీపురు
బహుళీకృతః (త్రి) తూర్పాఱినధాన్యము

బహువారకః (పు) తిరిగిచెట్టు.
బహువిధః (త్రి) అనేకవిధమైనది.
బహువీర్యః (పు) తాడిచెట్టు
బహుసుతా (స్త్రీ) పిల్లపీచరచెట్టు.
బహుసూతిః (స్త్రీ) పెక్కుఈతలయావు
బహుస్వనః (పు) గుడ్లగూబ.
బహ్వా (త్రి) తిండిపోతు.
బహ్వాప్తః (త్రి) మిక్కిలిబహులమైనది.
బా (స్త్రీ) బూరుగచెట్టు-తీగ
బాడబమ్ (న) ఆడగుఱ్ఱములగుంపు.
బాడబః (పు) బ్రాహ్మణుఁడు.
బాడబ్యమ్ } బాడవ్యమ్ } (న) బ్రాహ్మణసమూహము
బాఢమ్ (న) గట్టిగా.
బాధతే (ధా) ఆ-శప్- బాధృఅపాయే- దాటుచున్నాఁడు
బాణః (పు)అంబు-బలిచక్రవర్తికొడుకు
బాణా (స్త్రీ) పిప్పలిచెట్టు.
బాదరః (త్రి) నూలుతోఁజేసినబట్ట.
బాధతే (ధా) ఆ-శప్ - బాధచేయుచున్నాఁడు.
బాధా (స్త్రీ) దుఃఖము.
బాన్ధకినేయః (త్రి) రంకులాడికొడుకు.
బాన్ధవః (పు) జ్ఞాతి - స్నేహితుఁడు.
బాలమ్ (న) వురువేఱు.
బాలః (పు) గాడిద (త్రి) ౫-సంవత్సరములపిల్ల - మూర్ఖుఁడు.
బాలతనయః (పు) చండ్రచెట్టు.
బాలమూషికా (స్త్రీ) చిట్టెలుక.
బాలిశః (త్రి) పిన్నవాఁడు-మూర్ఖుఁడు
బాలేయః (పు) గాడిద
బాలేయశాకః (పు) చితితేఁకుచెట్టు.

బాల్యమ్ (న) చిన్నతనము.
బాష్పమ్ (న) కన్నీఱు-తోటకూర.
బాష్పః (పు) ఆవిరి-కన్నీఱు.
బాష్పికా (స్త్రీ) మెట్టతోటకూర - ఇంగువమాను.
బాహుః (ద్వ) భుజము.
బాహుజః (పు) పట్టభద్రుఁడైనరాజు.
బాహుదమ్ (న) బాహుపురి.
బాహుదా (స్త్రీ) నదీవిశేషము.
బాహుమూలమ్ (న) చంక.
బాహులః (పు) కార్తికమాసము - అగ్ని-శాక్యమునికొడుకు.
బాహులేయః (పు) కుమారస్వామి.
బాహ్లీకమ్ (న) కుంకుమము-ఇంగువ
బాహ్లికః } (పు) బాహ్లీకదేశపుగుఱ్ఱము-
బాహ్లీకః } బాహ్లీకదేశము - గంధర్వుఁడు
బిడమ్ (న) అంటుప్పు
బిడాలః (పు) పిల్లి-నేత్రరోగము.
బిడౌజాః (పు) ఇంద్రుఁడు-దున్నపోతు
బిద్దతి (ధా) ప - శప్ - అవయవములను ఛేయుచున్నాఁడు.
బిన్దుః (పు) బిందువు - అనుస్వారము - లేక సున్న.
బిమ్బః (స్త్రీ) సూర్యచంద్రాదిమండలములు-ప్రతిబింబము.
బిమ్బికా (స్త్రీ) దొండచెట్టు.
బిలమ్ (న) రంధ్రము.
బిలేశయః (పు) పాము.
బిలేశయా (స్త్రీ) ఉడుము.
బిల్వమ్ (న) మారేడుచెట్టు.
బిసమ్ (న) తామరతీఁగె.
బిసకణ్ఠికా (స్త్రీ) తెల్లకొక్కెరచెట్టు.
బిసప్రసూనమ్ (న) తామరపువ్వు.
బిసినీ (స్త్రీ) తామరతీఁగె
బిస్తః (పు) అశుమెత్తుబంగారము.
బీజమ్ (న) కారణము-వీర్యము - తత్త్వము-అన్నము-మంత్రము.
బీజకోశః (పు) తామరకాయ.
బీజపూరః (పు) మాదీఫలవుచెట్టు
బీజా (స్త్రీ) విత్తులునాటడము.
బీజాకృతః (త్రి) దున్ని విత్తులువేసినపొలము
బీజ్యః (పు) సత్కులమునందుఁ బుట్టినవాఁడు.
బుక్కతి (ధా) ప- శప్ - మొఱుగుచున్నాఁడు.
బుక్కమ్ (త్రి) శ్రోత్రమునందుఁ బ్రసిద్ధమయినమాంసము.
బుగ్గతి (ధా) ప - శప్ - విడుచుచున్నాఁడు.
బుద్ధః (పు) బుద్ధదేవుఁడు-విద్వాంసుఁడు
బుధః (పు) బుధుఁడు-విద్వాంసుఁడు.
బుధితః (త్రి) ఎఱుఁగఁబడినది
బుధ్నః (పు) వేఱు-ఊడ-శివుఁడు.
బుభుక్షా (స్త్రీ) ఆఁకలి
బుభుక్షితః (త్రి) ఆఁకలిగొన్నవాఁడు.
బుషమ్ (న) ధాన్యపుపొల్లు.
బుసమ్ (న) ఉమకచెత్త-పొల్లు-తోఁడుబెట్టినకుండలోనిఅడుగుపెఱుగు
బృందిష్ఠః (త్రి) మిక్కిలిదట్టమయినది.
బృహత్ (త్రి) గొప్పది.
బృహతికా (స్త్రీ) పైబట్ట.
బృహతీ (స్త్రీ)వాఁకుడుచెట్టు-నేలములక.
బృహత్కుక్షిః (త్రి) పెద్దకడుపుఁగలవాఁడు.

బృహద్భానుః (పు) అగ్నిహోత్రుఁడు-చిత్రకవృక్షము.
బృహస్పతిః (పు) సురాచార్యుఁడు.
బేటతి (ధా) ప-శప్ - బిటఆక్రోశే - బొబ్బలుఁబెట్టుచున్నాఁడు.
బోధకరః(పు) మేలుకొలుపులుపాడెడువాఁడు.
బోధిద్రుమః (పు) రావిచెట్టు.
బోలః (పు) బాలింతబోలు.
బోలా (సీ) సుడి.
బ్రధ్నః (పు) సూర్యుఁడు- ఊడ.
బ్రహ్మ (న) వేదము-పరమాత్మ-తపస్సు-నాపము-శబ్దము-జ్ఞానము.
బ్రహ్మచారీ (పు) బ్రహ్మచారి- గంగరావిచెట్టు-వటుఁడు. [ట్టు
బ్రహ్మణ్యః(పు) విష్ణువు-శని-గంగరావిచె
బ్రహ్మత్వమ్ (న) బ్రహ్మసాయుజ్యము-బ్రహ్మభావము
బ్రహ్మదారుః (పు) గంగరావిచెట్టు
బ్రహ్మపుత్రః (పు) విషభేదము.
బ్రహ్మబన్ధుః (పు) కూటసాక్షియైన నిందితుఁడు
బ్రహ్మబిన్దుః (పు) వేదపాఠమునందలినోటితుంపర
బ్రహ్మభూయమ్ (న) బ్రహ్మసాయుజ్యము
బ్రహ్మయజ్ఞః (పు) వేదపాఠము
బ్రహ్మసాయుజ్యమ్(న)బ్రహ్మస్వరూపము
బ్రహ్మసూః (పు) మన్మథుఁడు.
బ్రహ్మోజ్ఝితిః (పు) వేదపాఠమునందుమొఱ్ఱకుట.
బ్రహ్మాసనమ్ (న) ఆసనవిశేషణము.
బ్రాహ్మణః (పు) బ్రాహ్మణుఁడు.
బ్రాహ్మణయష్టికా (సీ) చిఱుతేఁకుచెట్టు.
బ్రాహ్మణ్యమ్ (న) బ్రాహ్మణసమూహము బ్రాహ్మణకర్మ
బ్రాహ్మీ (సీ) రోహిణీనక్షత్రము - సరస్వతి - బ్రహ్మిచెట్టు - పొన్నగంటిచెట్టు.

## భ

భమ్ (న) నక్షత్రము-ఆకసము-గ్రహము
భః (పు) శివుఁడు-తుమ్మెద - శుక్రుఁడు-కిరణము-మేఘము (సీ) భూమి-అలంకారము-ప్రకాశము.
భక్తమ్ (న) అన్నము
భగ (మ్ న) ఆకాశము- స్వర్గము - స్త్రీచిహ్నము - ఐశ్వర్యము - కీర్తి-జ్ఞానము-వైరాగ్యము-యత్నము-ధర్మము-మోక్షము - కాంతి-సూర్యుఁడు-చంద్రుఁడు
భగః (పు) ధర్మము - వైరాగ్యము-ప్రయత్నము - ఆశ్చర్యము - యుక్తి-పరాక్రమము-కీర్తి-జ్ఞానము-మోక్షము (సీ) యోని.
భగన్దరః (పు) మర్మస్థానసమీపవ్రణము.
భగినీ (సీ) తోడఁబుట్టినది
భగీ (సీ) గంజాయిచెట్టు
భగోః (అ) ఓయి.
భఙ్గః (పు) అల- తునక-పరాజయము-భయము (సీ) గిలకచెట్టు.
భఙ్గా (సీ) జనపవిత్తులు.
భజమానః (త్రి) తగినది.
భటః (పు) కాలిబంటు- తిన్ననివాఁడు.
భటతి (ధా) ప - శప్ - భటభృతౌ - భరించుచున్నాఁడు.

భట్టినీ (స్త్రీ) భోగార్థమయిన స్త్రీ.

భణతి (ధా) ప-శప్ - భణశబ్దే-ధ్వనిఁజే యుచున్నాఁడు.

భణ్డతే (ధా) ఆ-శప్ - భడిపరిభాషణే-పరిహాసముఁజేయుచున్నాఁడు.

భణ్డీరః (పు) దిరిసెనచెట్టు.

భణ్డీరీ (స్త్రీ) మంజిష్ఠతీఁగె.

భణ్డీలః (పు) దిరిసెనచెట్టు.

భద్రమ్ (న) శుభము-సుఖము - పిల్లియ నైదుచెట్టు.

భద్రః (పు) ఎద్దు - శివుఁడు.

భద్రకుమ్భః (పు) రాజద్వారమునందుం చినపూర్ణకలశము.

భద్రదారు (న) దేవదారువృక్షము.

భద్రపర్ణీ (స్త్రీ) గుమ్ముడుచెట్టు

భద్రబలా (స్త్రీ) గొంతెమగోరుచెట్టు.

భద్రయవమ్ (న) కొడిసెఫలము.

భద్రశ్రీః (స్త్రీ) చందనవృక్షము.

భన్దతే (ధా) ఆ-శప్ - శుభముగానుంచు న్నాఁడు - సుఖముగానుంచు న్నాఁడు.

భయమ్ (న) భీతి.

భయఙ్కరమ్ (న) భయానకరసము.

భయద్రుతః (త్రి) పాఱిపోయినవాఁడు

భయానకః (పు) రాహు.

భరః (పు) అతిశయము-ఱిం - తులము లరువెత్తు.

భర్త్సతే (ధా) ఆ- శప్ - భృతిభర్త్సనే - భె దించుచున్నాఁడు.

భరణమ్ } (న) జీతము-కూలి.
భరణ్యమ్ }

భరద్వాజః (పు) మునివిశేషము-ద్రోణా చార్యులు - ద్రోణాచార్యునితం డ్రి.

మారుఁడు.

భర్గః (పు) శివుఁడు(న) కాంతి-లేతఱ్ఱు.

భర్తా (పు)మగఁడు-పోషించువాఁడు.

భర్తృదారకః (పు) నాట్యమునందుయు వరాజు.

భర్తృదారికా (స్త్రీ) నాట్యమునందురా జకొమార్తె.

భర్తృహరిః (పు) భర్తృహరియనుకావ్య ముఁజేసిన

భర్త్సనమ్ (న) బెదిరించుట

భర్మ (న) బంగారము - కూలి- జీతము.

భలతి (ధా) ప - శప్ - భలాభిశరణే- ఫలించుచున్నది

భలతే } (ధా) ఆ-శప్ - భలభల్లపరిభా
భల్లతే } షణహింసాదానేషు- మాటలా డుచున్నాఁడు - హింసించుచు న్నాఁడు-స్వీకరించుచున్నాఁడు.

భల్లః (పు) ఎలుగుబంటి - బాణము.

భల్లాతకః(పు) } జీడిచెట్టు.
భల్లాతకీ (స్త్రీ) }

భల్లుకః } (పు) ఎలుఁగుబంటి.
భల్లూకః }

భల్లుఙ్కః (పు) కోతి

భవః (పు) శివుఁడు-సంసారము.

భవతి (అ) ఉండుడిము

భవతు (అ) కోపముచేతనంగీకరించుట.

భవనమ్ (న) ఇల్లు.

భవాదృక్ (త్రి) నీవంటి [illegible]

భవాదృశః (త్రి) [illegible] వాఁడు.

భవానీ (స్త్రీ) పార్వతి
భవికమ్ (న) శుభము
భవితా / భవిష్ణుః } (త్రి) కాఁగలవాఁడు.
భవ్యమ్ (న) శుభము
భషకః (పు) కుక్క
భషణమ్ (న) కుక్కధ్వని
భస్త్రికా భస్త్రా (స్త్రీ) కొలిమితిత్తి.
భస్మగంధినీ / భస్మగర్భా } (స్త్రీ) రేణుకమను గంధద్రవ్యము
భక్షకః (త్రి) తిండిపోతు
భక్షితః (త్రి) తినఁబడినది
భక్ష్యకారః (త్రి) పిండివంటఁజేసెడువాఁడు
భా (స్త్రీ) కాంతి - భూమి
భాః (పు) సూర్యుఁడు.
భాగః (పు) / భాగధేయమ్ (న) } భాగము-భాగ్యము
భాగినేయః (పు) మేనల్లుఁడు
భాగినేయీ (స్త్రీ) మేనకోడలు.
భాగీరథీ (స్త్రీ) గంగానది
భాగ్యమ్ (న) అదృష్టము - శుభకర్మము- అశుభకర్మము.
భాజనమ్ (న) కంచము.
భాటాకః (పు) బాడిగ
భాణ్డమ్ (న) కుండ-గుఱ్ఱములసొమ్ము- మద్దెలకుండ - పాత్రము - భూషణము-వర్తకునియొద్దిలాభము కొఱకునుంచినమూలద్రవ్యము.
భాణ్డీ (స్త్రీ) మంజిష్ఠవృక్షము.
భాద్రపదః (పు) భాద్రపదమాసము.
భాద్రపదాః (స్త్రీ) పూర్వాభాద్ర, ఉత్తరాభాద్ర నక్షత్రములు.

భానుః (పు) సూర్యుఁడు.
భామతే (ధా) ఆ - శప్-భామ క్రోధే - కోపించుచున్నాఁడు
భామినీ (స్త్రీ) శృంగారచేష్టగల స్త్రీ
భారః (పు) ౨౦౦౦-తులములయెత్తు- బారువు-పుట్టెడు- బరువు
భారతః (పు) నాట్యగాడు, అనఁగా మేళము గట్టికొనిఆడించెడువాఁడు(స్త్రీ) జంబూద్వీపము, అనఁగా హిమవత్పర్వత, దక్షిణసేతు పర్యంతదేశము
భారతవర్షమ్ (న) జంబూద్వీపము
భారతీ (స్త్రీ) సరస్వతి - తులసి
భారద్వాజః (పు) భరద్వాజగోత్రమునందుఁబుట్టినవాఁడు - ద్రోణాచార్యులు - ద్రోణాచార్యునికొమారుఁడు-పులి- బృహస్పతికొడుకు.
భారద్వాజీ (స్త్రీ) అడవిప్రత్తిచెట్టు.
భారయష్టిః (స్త్రీ) కావడిబద్ద
భారవాహః (పు) బరువుమోసెడికూలివాఁడు
భార్గవః (పు) శుక్రుఁడు-పరశురాముఁడు.
భార్గవీ (స్త్రీ) గరికెగడ్డి.
భార్యా (స్త్రీ) పెండ్లాము.
భార్యాపతీ (పు) దంపతులు, అనఁగా పెనిమిటిభార్యలు
భాలుకః / భాలూకః } (పు) ఎలుఁగుబంటి,
భాల్లుకః / భాల్లూకః } (పు) ఎలుఁగుబంటి.
భావః (పు) మనోవికారము-స్వభావము- అభిప్రాయము - ఆత్మ-పుట్టుక.

భావితః (త్రి) పరిమళింపఁజేయఁబడినది- పొందఁబడినది
భావినీ (స్త్రీ) స్త్రీ
భావుకమ్ (న) శుభము.
భావుకః (పు) బావమరిది
భాషా (స్త్రీ) సరస్వతి
భాషితమ్ (న) వాక్యము.
భాషితః (త్రి) చెప్పఁబడినది
భాసః (పు) కాంతి-ఒకతరహాపక్షి - పశువులదొడ్డి-కోడి-గ్రద్ద- పాలపిట్ట - జేనెడు- ఉత్సవము
భాస్కరః (పు) సూర్యుఁడు- జవ్వాది- అగ్ని - వాయువు.
భాస్వతీ (స్త్రీ) సూర్యపట్టణము
భాస్వరః (పు) దినము - సూర్యుఁడు.
భాస్వాన్ (పు) సూర్యుఁడు- కాంతి.
భిత్తమ్ (న) తునక.
భిత్తిః (స్త్రీ) గోడ
భిదా (స్త్రీ) ప్రక్కలించుట.
భిదురమ్ (న) వజ్రాయుధము
భిన్నః (త్రి) ప్రక్కలించబడినది.
భిషక్ (త్రి) వైద్యుఁడు
భిస్సటా (స్త్రీ) మాడిన అన్నము.
భిక్షా (స్త్రీ) యాచన- సేవించుట.
భిక్షాటనమ్ (న) భిక్షకొరకుపోవుట.
భిక్షుః (పు) సన్యాసి - బ్రహ్మచారి -తపస్వి.
భీః (స్త్రీ) భయము.
భీతః (త్రి) భయపడినవాఁడు.
భీతిః (స్త్రీ) భయము-కంపము.
భీభత్సుః (పు) అర్జునుఁడు (త్రి) చంపుస్వభావముఁగలవాఁడు.
భీమః (పు) శివుఁడు - భీముఁడు - భిల్లప్రబ్బచెట్టు
భీరుః (పు) నక్క-పులి (స్త్రీ) పిల్లపెసర- భయముగల స్త్రీ
భీరుకః }
భీలుకః } (త్రి) భయస్థుఁడు
భీషణః }
భీష్మః } (త్రి) భయానకరసము.
భీష్మః (పు) భీష్ములవారు
భీష్మసూ (స్త్రీ) గంగానది
భుః (పు) శివుఁడు-బ్రహ్మ - చంద్రుఁడు
భుక్తః (త్రి) తినఁబడినది
భుగ్నః (త్రి) వంగినది - విరిగినది
భుజః (పు) భుజపత్రిచెట్టు (ద్వి) బాహువు-హస్తము.
భుజగః }
భుజఙ్గః } (పు) పాము
భుజఙ్గభుక్ (పు) నెమలి.
భుజఙ్గమః (పు) సర్పము
భుజఙ్గాక్షీ (స్త్రీ) సర్పాక్షీచెట్టు
భుజశిరః (పు) మూపు
భుజా (స్త్రీ) భుజము-హస్తము.
భుజాన్తరమ్ (న) రొమ్ము
భుజిష్యః (పు) జీతగాఁడు.
భువనమ్(న) జలము- ఆకసము-లోకము
భూ (ధా) ప - శప్ భూసత్తాయాం - అవుచున్నది.
భూః (స్త్రీ) భూమి - స్థానము.
భూతమ్ (త్రి) ప్రాప్తమయినది - సత్యమయినది (న) యోగ్యమయినది-పంచభూతములు - సత్యము- యుక్తము-న్యాయము.

భూతః (పు) దేవయోనివిశేషము-పిశాచాదిభూతములు
భూతకేశః (పు) జటామాంసి,
భూతభృత్ (పు) విష్ణువు
భూతయజ్ఞః (పు) భూతబలి
భూతవేశీ (స్త్రీ) తెల్లవావిలిచెట్టు
భూతాత్మా (పు) బ్రహ్మ - దేహము - శివుఁడు - యుద్ధము - విష్ణువు
భూతావాసః (పు) విష్ణువు-తాఁడిచెట్టు
భూతిః (స్త్రీ) అష్టైశ్వర్యములు - భస్మము-సంపద - జన్మము.
భూపః (పు) రాజు
భూపదీ (స్త్రీ) మల్లెచెట్టు.
భూభృత్ (పు) పర్వతము-రాజు.
భూమిః (స్త్రీ) నేల - జిహ్వ
భూమిజమ్బుకా (స్త్రీ) నేలనేరేడుచెట్టు.
భూమిస్పృక్ (పు) వైశ్యుఁడు - నరుఁడు
భూయః (అ) తిరిగి
భూయాన్ }
భూయిష్టః } (త్రి) అధికమయినది.
భూరిః }
భూరిఫేనా (స్త్రీ) సంభరేణిచెట్టు.
భూరిమాయః }
భూరిమాయుః } (పు) నక్క
భూరుణ్డీ (స్త్రీ) గురుగుచెట్టు.
భూషణమ్ (న) శృంగారించుకొనుట - ఆభరణము
భూషితః (త్రి) అలంకరించఁబడినది.
భూష్ణుః (త్రి) కాఁగలవాఁడు.
భూస్తృణమ్ (న) చిప్పగడ్డి.
భృగుః (పు) శుక్రుఁడు - శివుఁడు - జమదగ్ని - అగ్ని - గుంటకలగరచెట్టు-కొండచరియ
భృఙ్గమ్ (న) లవంగపుచెట్టు
భృఙ్గః (పు) గుంటకలగరచెట్టు - కూఁకటిమూఁగపిట్ట - తుమ్మెద-విటుఁడు - ఇప్పచెట్టు
భృఙ్గరాజః (పు) కోతి - శివుఁడు - మాణిక్యము - గుంటకలగరచెట్టు.
భృఙ్గారః (పు) బంగారపుగిన్నె - గుంటకలగరచెట్టు
భృఙ్గారీ (స్త్రీ) చిమ్మెట
భృతః (త్రి) నిండింపఁబడినది- భరించఁబడినది.
భృతకః (పు) కూలివాఁడు
భృతిః (స్త్రీ) జీతము-కూలి-భరించడము.
భృతిభుక్ (పు) కూలివాఁడు.
భృత్యః (పు) జీతగాఁడు
భృత్యా (స్త్రీ) కూలి - జీతము.
భృశమ్ (న) అతిశయము
భేకః (పు) కప్ప - మేఘము.
భేకీ (స్త్రీ) ఆఁడుకప్ప
భేదః (పు) ఉభయశత్రువులకువిరోధము పుట్టించుట- బద్దలుచేయుట.
భేదితః (త్రి) బద్దలయినది.
భేరీ (స్త్రీ) నగారా.
భేవతే (ధా) ఆ - శప్ - భేవృ సేవనే- సేవించుచున్నాఁడు
భేషజమ్ (న) ఔషధము.
భైరవః (పు) భైరవుఁడు-శివుఁడు,
భైషజ్యమ్ (న) ఔషధము.
భైక్షమ్ (న) భిక్షాపదార్థము
భోః (అ) సంబోధనార్థము - ఓయి.

భోగః (పు) సుఖము- స్త్రీలు-పాముపడగ-పాము-శరీరము - భోజనము-ధనము-అనుభవించుట - పాలించుట-రాజ్యము.

భోగవతీ (స్త్రీ) పాతాళలోకమునందుండెడినది-భుక్తి- రతి.

భోగినీ (స్త్రీ) రాజభార్య.

భోగీ (పు) పాము-కొండెపుచెట్టు- భూమి పాలించెడివాఁడు-ఊరిదొర.

భోజనమ్ (న) ఆహారము.

భౌమః (పు) అంగారకుఁడు - నరకాసురుఁడు

భౌరికః (పు) వరహాలఖజాంజి - స్వర్ణాధికారి.

భ్రకుంశః } (పు) స్త్రీవలెనేయాడెడు పురుషుఁడు.
భ్రకుంసః }

భ్రకుటిః (స్త్రీ) బొమముడి.

భ్రణతి (ధా) ప-శప్-భ్రణశబ్దార్థే- ధ్వనిఁ జేయుచున్నాఁడు.

భ్రమః (పు) } గిరగిరఁ దిరగడము.
భ్రమణమ్ (న) }

భ్రమరః (పు) తుమ్మెద - అభినయహస్తము-ఇప్పచెట్టు- ముంగురులు.

భ్రమరకః (స్త్రీ) నుదుటసంచరించెడిముంగురులు - బొంగరము-తుమ్మెద.

భ్రమిః } (స్త్రీ) గిరిగిరతిరుగుట.
భ్రమీ }

భ్రష్టః (త్రి) జారినది.

భ్రాజతే (ధా) ఆ-శప్-భ్రాజృదీప్తౌ- ప్రకాశించుచున్నాఁడు.

భ్రాజిష్ణుః (పు) విష్ణువు (త్రి) భూషణా

భ్రాతా (పు) సహోదరుఁడు

భ్రాతృజః(పు)తోడఁబుట్టినవానికొడుకు.

భ్రాతృజాయా (స్త్రీ) భ్రాతృభార్య

భ్రాతృవ్యః (త్రి) } తోడబుట్టినవానికొడుకు.
భ్రాత్రీయః (పు) }

భ్రాష్ట్రిః (పు) మంగలము.

భ్రుకుంశః } (పు) స్త్రీవలెయాడు పురుషుఁడు.
భ్రుకుంసః }

భ్రుకుటిః (స్త్రీ) బొమముడి.

భ్రూః (స్త్రీ) కనుబొమ్మ

భ్రూకుంశః } (పు) స్త్రీవలెయాడు పురుషుఁడు.
భ్రూకుంసః }

భ్రూకుటిః (స్త్రీ) బొమముడి.

భ్రూణః (పు) కడుపులోనిపిల్ల.

భ్రేజతే (ధా) ఆ - శప్ - భ్రేజృదీప్తౌ- ప్రకాశించుచున్నాఁడు.

భ్రేషః (పు) తనకుచితమైనధర్మమునడచుట (త్రి) చెడిపోయినవాఁడు.

## మ

మమ్ (న) జలము

మః (పు) మధ్యమస్వరస్థానము - శంభువు - బ్రహ్మ - చంద్రుఁడు - అగ్ని - జీవుఁడు-యముఁడు- సమయము-విషము-విష్ణువు.

మకరః (పు) మొసలి.

మకరధ్వజః (పు) మన్మథుఁడు - రససింధూరము.

మకరన్దః (పు) పూదేనె - కుందయనెడు చెట్టు.

మకుటమ్ (త్రి) కిరీటము.

మకుష్టకః (పు) పీనుఁగపెసలు, అనఁగా నడవిపెసలు.

మకూలకః (పు) నాగదంతిచెట్టు.

మఖః (పు) యజ్ఞము.

మఖతి (ధా) ప-శప్-నడుచుచున్నాఁడు

మగధః (పు) భట్రాజు.

మఘః (పు) యజ్ఞము.

మఘవాన్ (పు) ఇంద్రుఁడు.

మఘా (స్త్రీ) మఘయనునక్షత్రము-ఔషధవిశేషము.

మఙ్క్తే (ధా) ఆ-శప్-అలంకరించుచున్నాఁడు

మఙ్ఖతి (ధా)ప-శప్-నడుచుచున్నాఁడు.

మఙ్ఘతే (ధా)ఆ-శప్-పోవుచున్నాఁడు-ఆరంభించుచున్నాఁడు-సెపముఁజేయుచున్నాఁడు

మఙ్గతి (ధా)ప-శప్-నడుచుచున్నాఁడు

మఙ్గలమ్ (న) శుభము-బుద్ధి - వృద్ధియనెనోషధి

మఙ్గలా (స్త్రీ) పసపు-పార్వతి-పతివ్రత-తెల్లగరిక.

మఙ్గల్యమ్ (న) కృష్ణాంగరు- చందనము-బంగారము

మఙ్గల్యకః (పు) చిరుసెనగలు.

మఙ్ఘతి (ధా) ప - శప్ - అలంకరించుచున్నాఁడు

మచర్చికా (స్త్రీ) శ్రేష్ఠమైనది.

మచతే (ధా) ఆ-శప్ - మచకల్కనే - గర్వించుచున్నాఁడు-దంభముఁజేయుచున్నాఁడు.

మజ్జా (స్త్రీ) చెట్టుచేవ - ఎముకలలోనిక్రొవ్వు

మఞ్చః (పు) మంచము.

మఞ్చతే (ధా) ఆ-శప్ - మచిధారణోచ్ఛ్రాయ ఉచ్ఛ్రాయపూజనేషు ధరించుచున్నాఁడు - అతిశయించుచున్నాఁడు - పూజించుచున్నాఁడు.

మఞ్జరీ (స్త్రీ) పూగుత్తి - చిగురుగుత్తి.

మఞ్జిష్ఠా (స్త్రీ) మంజిష్టచెట్టు.

మఞ్జీరః (స్త్రీ) కాలిఅందె.

మఞ్జుః
మఞ్జులః } (త్రి) చక్కనిది

మఞ్జూషా (స్త్రీ) పెట్టె

మటతీ (స్త్రీ) వడగండ్లు. [సము.

మఠః (పు) సన్న్యాసిబ్రహ్మచర్యాదులవా

మఠతి (ధా) ప-శప్ - మఠమదనివాసయోః- మదించుచున్నాఁడు - నివసించుచున్నాఁడు.

మడ్డుః (పు) మడ్డుయనువాద్యవిశేషము.

మణిః (పు) తేలుకొండి - రత్నము.

మణికమ్(న)
మణికః(పు) } పెద్దబాన.

మణ్ఠతే (ధా) ఆ-శప్-మఠిశోకే - ధ్యానించుచున్నాఁడు.

మణ్డః (పు)ఆముదపుచెట్టు (స్త్రీ) మీఁగడ.

మణ్డతి (ధా) ప- శప్-మడభూషాయాం అలంకరించుచున్నాఁడు

మణ్డతే (ధా) ఆ-శప్ - మడివిభాజనే-విభాగముఁజేయుచున్నాఁడు.

మణ్డనః (త్రి)శృంగారించుట-భూషణము.

మణ్డపః (స్త్రీ) చావడి.

మణ్డలమ్ (న) వలయాకారవస్తువు- సూర్యచంద్రబింబములు.

మణ్డలకమ్ (న) గుంజానికష్టు.
మణ్డలాగ్రః (పు) ఖడ్గము.
మణ్డలేశ్వరః (పు) మండలాధిపతి, అనఁగా ౪౦౦-యోజనముల భూమిని పాలించునట్టి లక్షగ్రామములక ధిపతి.
మణ్డితః (త్రి) అలంకరించుకొనినవాఁడు
మణ్డుకః
మణ్డూకః } (పు) కప్ప-కొండచిలువ.
మణ్డూకపర్ణః (పు) దుండిలపుచెట్టు.
మణ్డూకపర్ణీ (సీ) మంజిష్ఠచెట్టు - మండూకబ్రహ్మీచెట్టు
మణ్డూరమ్ (న) ఇనుపచిట్టము.
మణతి (ధా) ప-శబ్-మణశబ్దార్థే- ధ్వనిఁజేయుచున్నాఁడు
మతఙ్గజః
మతఙ్గమః } (పు) ఏనుఁగు.
మతల్లికా (సీ) శ్రేష్ఠమైనది.
మతిః (సీ) బుద్ధి-ఇచ్ఛ
మత్కుణః
మత్కుణః } (పు) నల్లి.
మత్తః (పు) మదించినయేనుఁగు
మత్తకాశినీ
మత్తకాసినీ } (సీ) ఉత్తమస్త్రీ
మత్సరః(పు)పరుల మేలుఁజూపలేనివాఁడు
మత్స్యః (పు) చేప - విరాటదేశస్థుఁడు-౧౮ పురాణాంతర్గతపురాణములలోనొకటి - దశావతారములలో ప్రథమావతారము.
మత్స్యగన్ధా (సీ) వ్యాసులవారితల్లి
మత్స్యణ్డీ(సీ)
మత్స్యణ్డి(న) పంచదారపాకము.
మత్స్యధానీ (సీ) చేఁపలబుట్ట
మత్స్యపిత్తా (సీ) కటుకరోహిణి.
మత్స్యరాట్ (పు) మొసలి.
మత్స్యవేధనమ్ (న) గాలము
మత్స్యాక్షీ (సీ) పొన్నగంటిచెట్టు.
మథితమ్ (న) నీళ్లుఁగలియనిమజ్జిగ.
మథిన్ (పు) కవ్వము
మదః(పు)మదము-గర్వము-సంతోషము.
మదకలః (పు) మదపుటేనుఁగు.
మదనమ్ (న) మైనము
మదనః (పు) మన్మథుఁడు - ముసుఁగుచెట్టు-వెలగచెట్టు.
మదనీ (సీ) మెంతులు.
మదస్థానమ్ (న) కల్లంగడి, అనఁగా కల్లుఁద్రాగెడుఇల్లు.
మదిరా (సీ) కల్లు.
మదిరాగృహమ్ (న) మద్యగృహము.
మదిష్ఠా (సీ) కల్లు
మదోత్కటః (పు) పావురము- మదపుటేనుఁగు
మద్గుః (పు) నీటికాకి
మద్గురః (పు) మునిగియుండెడుచేప.
మద్యమ్ (న) కల్లు.
మధ్యమ్ (న) నడుము
మధుః (పు) చైత్రమాసము-వసంతఋతువు-అశోకవృక్షము- మధువనురాక్షసుఁడు (సీ) ఇప్పపువ్వులతోఁజేసినసారాయి (న) కల్లు-పూదేనె - తేనె - పాలు,
మధుకః (పు) ఇప్పచెట్టు-వెదురు- కప్పతుమ్మెద-తొగరిచెట్టు - కల్లుఁద్రాగువాఁడు

మధుకరః (పు) శివకళపుచెట్టు - తుమ్మెద-
మధుక్రమః (పు) కల్లుఁద్రాగుపాత్రను మార్చుకొనెడువరుస.
మధుద్రుమః (పు) ఇప్పచెట్టు.
మధుద్రా (స్త్రీ) కల్లుబెల్లము.
మధుపః (పు) తుమ్మెద.
మధుపర్ణికా (స్త్రీ) గుమ్ముడుచెట్టు - నీలిచెట్టు
మధుపర్ణి (స్త్రీ) తిప్పతీఁగె
మధుఫలా (స్త్రీ) కరుబూజాదోస.
మధుమక్షికా (స్త్రీ) తేనటీఁగ.
మధుయష్టికా (స్త్రీ) అతిమధురము.
మధురః (పు) తీపి - తియ్యనివస్తువు ఎఱ్ఱముసుఁగుచెట్టు - రాచమామిడిచెట్టు.
మధురసా (స్త్రీ) చాఁగచెట్టు
మధురా (స్త్రీ) మధురాపట్టణము- పాలంకిచెట్టు - నమ్మదుంప.
మధురికా (స్త్రీ) పిన్నసదాపచెట్టు.
మధురిపుః (పు) విష్ణువు.
మధులిట్
మధులేహి (పు) తుమ్మెద.
మధువాక్ (పు) కోయిల.
మధుశ్రేణీ (స్త్రీ) చాఁగచెట్టు
మధుష్ఠీలః
మధుష్ఠీవః } (పు) ఇప్పచెట్టు.
మధుస్రవా (స్త్రీ) పాలకూరచెట్టు
మధూకః (పు) ఇప్పచెట్టు
మధూచ్ఛిష్టమ్ (న) మైనము.
మధూలకః (పు) నీటిప్పచెట్టు
మధూలిః (స్త్రీ) కల్లు - పూలరసము
మధూలికా (స్త్రీ) చాఁగచెట్టు

మధ్యః (స్త్రీ)నడుము.
మధ్యమా (స్త్రీ) నడిమివ్రేలు- క్రొత్తగా సమర్తాడిన స్త్రీ.
మనః (న) మనస్సు - చిత్తము.
మనశ్శిలా (పు) మణిశిల.
మనసిజః (పు) మన్మథుఁడు.
మనస్కారః (పు) నిండుమనస్సు.
మనాక్ (అ) కొంచెమనుట.
మనితః (త్రి) తెలియఁబడినది.
మనీషా (స్త్రీ) బుద్ధి.
మనీషీ (పు) విద్వాంసుఁడు.
మనుజః
మనుష్యః } (పు) మనుజుఁడు
మనుష్యధర్మా (పు) కుబేరుఁడు
మనుష్యయజ్ఞః (పు) అతిథిపూజ.
మనోగుప్తా (స్త్రీ) మణిశిల
మనోజవః
మనోజవసః } (త్రి) తండ్రినిఁబోలిన వాఁడు.
మనోజ్ఞః (త్రి) చక్కనిది
మనోరథః (పు) కోరిక.
మనోహతః (త్రి) మనోల్లాసముఁజెడిన వాఁడు అలక్ష్యకాయించఁబడినవాఁడు.
మనోహరః (త్రి) చక్కనివాఁడు
మనోహ్వా (స్త్రీ) మణిశిల.
మన్తుః (పు) అపరాధము.
మన్త్రః (స్త్రీ) రహస్యపుమాట.
మన్త్రీ (పు) రాజకార్యాలోచనఁజెప్పెడువాఁడు
మన్దతే (ధా) ఆ - శప్ - స్తుతిజేయుచున్నాఁడు- సంతోషించుచున్నాఁడు- స్తుతుగానుంచున్నాఁడు- ని

ద్రించుచున్నాఁడు- ప్రకాశించుచున్నాఁడు- నడుచుచున్నాఁడు.
మన్థః (పు) కవ్వము
మన్థతి (ధా) ప - శప్ - చిలకరించుచున్నాఁడు - కలియఁబెట్టుచున్నాఁడు-హింసించుచున్నాఁడు
మన్థానః (పు) కవ్వము
మన్దః (పు) శని-యముఁడు.
(త్రి) అలసుఁడు- మూఢుఁడు- నిర్భాగ్యుఁడు.
మన్దగామీ (స్త్రీ) మెల్లననడిచెడువాఁడు
మన్దా (స్త్రీ) చిన్నముక్కు.
మన్దాక్షమ్ (న) సిగ్గు
మన్దారః (పు) దేవవృక్షము - పారిజాతము-జిల్లేడుచెట్టు
మన్దిరమ్ (న) ఇల్లు - పట్టణము.
మన్దురా (స్త్రీ) గుఱ్ఱములశాల.
మన్దోష్ణమ్ (న) కొంచము వేఁడి
మన్ద్రః (త్రి) గంభీరధ్వని
మన్ధనీ (స్త్రీ) పెఱుగుఁదరిచెడుకుండ
మన్థరః (పు) కవ్వము - చక్రము- ఆకాశము
మన్మథః (పు) మన్మథుఁడు. [ము.
మన్యా (స్త్రీ) పెడతలనుండెడుబోలునరము
మన్యుః (పు) శోకము- కోపము - యజ్ఞము - దైన్యము.
మన్యే (అ) తోఁచుచున్నది
మన్వన్తరమ్ (న) దేవతలడెబ్బదియొకయుగములకాలము.
మయః (పు) ఒంటె
మయతే(గా) ఆ - శప్-మయగతౌ- పోవుచున్నాఁడు
మయష్టకః } (పు) అడవిపెసలు.
మయష్టికః }
మయుః (పు) గుఱ్ఱపుముఖము.
మయూఖః (పు) సూర్యకిరణము- కాంతి - మంట.
మయూరః (పు) బ్రహ్మమేడిచెట్టు- ఓమము-నెమలి.
మయూరకమ్ (న) మైలతుత్థము.
మయూరవిదలా (స్త్రీ) నల్లతెగడ.
మరకతమ్ (న) పచ్చ.
మరణమ్ (న) చావు.
మరిచమ్ } (న) మిరియాలు.
మరీచమ్ }
మరీచిః (ద్వి) సూర్యకిరణము.
మరీచికా (స్త్రీ) ఎండమావు
మరుః (పు) నిర్జలభూమి- పర్వతము.
మరుత్ (పు) వాయువు-మరువపుచెట్టు
మరుత్వాన్ (పు) ఇంద్రుఁడు
మరున్మాలా (స్త్రీ) స్పృక్కయను గ్రంథము.
మరువకః (పు) మ్రంగచెట్టు- మరువము.
మర్కటః (పు) కోతి-సాలెపురుగు,
మర్కటకః (పు) సాలెపురుగు
మర్కటీ (స్త్రీ) ఆఁడుకోతి,
మర్త్యః (పు) మనుష్యుఁడు.,
మర్దనమ్ (న) పిసుకుట.
మర్దలః (పు) మద్దెల
మర్మ (న) ఆయువుపట్టు.
మర్మస్పృక్ (త్రి) మర్మములనొప్పించువాఁడు
మర్యాదా (స్త్రీ) సముద్రతీరము - మర్యాద - పొలిమేర

మలతే } (ధా) అ-శప్-మలమల్లధారణే
మల్లతే } ధరించుచున్నాఁడు.

మలమ్ (న) పాపము - పురీషము.

మలదూషితః (త్రి) మాసినది

మలపూః } (పు) బ్రహ్మమేడిచెట్టు
మలయూః }

మలినః (త్రి) మాసినది.

మలినీ (స్త్రీ) ముట్టయిన స్త్రీ.

మలిముచః (పు) దోమ.

మలీమసః (త్రి) మాసినది.

మలూకః (పు) యుద్ధకుశలుఁడు.

మల్లికః (పు) వేఁపచెట్టు - మాసినముక్కుఁగల తెల్లనిహంస

మల్లికా (స్త్రీ) మల్లెచెట్టు. [హంస

మల్లికాక్షః (పు) మాసినముక్కుఁగల తెల్లని

మవ్యతి (ధా) ప- శప్ - మవ్యబంధనే- కట్టుచున్నాఁడు.

మషీ (స్త్రీ) పెద్దసదాపచెట్టు-ఓమము

మసురః } (పు)-చిఱుసెనగలు.
మసూరః }

మసూరవిదళా (స్త్రీ) నల్లతెగడ.

మసృణః (త్రి) నిగ్గుగలది-ఒట్టమయినది- మిసిమిగలది

మస్కరః (పు) వెదురు.

మస్కరీ (పు) సన్యాసి-గోపాలకుఁడు

మస్తమ్(న) } శిరస్సు
మస్తకః(పు) }

మస్తిష్కమ్ (న) శిరస్సునందుండెడి నేతిముద్దవంటి మెదడు

మస్తు (న) పెఱుగుమీఁదిమీఁగడ.

మహః (పు) వివాహాదిపుణ్యదినములు- తేజస్సు - యజ్ఞము

మహత్ (న) రాజ్యము.

మహతీ (స్త్రీ) నారదమహామునివీణ- అధికమయినది.

మహా (స్త్రీ) ఆవు.

మహాకన్దః (పు) వెల్లుల్లి.

మహాకులః (పు) మంచికులమునఁబుట్టినవాఁడు

మహాజాలీ (స్త్రీ) పెద్దబీరచెట్టు

మహాదేవః (పు) శివుఁడు.

మహాధనమ్ (న) మిక్కిలివెలగలవస్త్రము

మహానసమ్ (న) వంటయిల్లు.

మహామాత్రః (పు) ముఖ్యమంత్రి - మావటుఁడు

మహామునిః (పు) రుద్రాక్ష - అగస్త్యముని - కృపాచార్యుఁడు - వ్యాసముని - రుద్రాక్షచెట్టు.

మహారజతమ్ (న) బంగారము.

మహారజనమ్ (న) కుసుమపువ్వు.

మహారణ్యమ్ (న) పెద్దయడవి

మహారాజికః (పు) మహారాజకులను గణదేవతలు.

మహారౌరవః (పు) నరకవిశేషము.

మహావీరః (పు) గరుత్మంతుఁడు-గొప్పశూరుఁడు-సింహము-వజ్రము-తెల్లనిగుఱ్ఱము-లక్ష్మణుఁడు - హనుమంతుఁడు-విష్ణువు-అగ్ని. [ము.

మహాశూద్రీ (స్త్రీ) గొల్లది-గొల్లవానిపెండ్లా

మహాశ్వేతా (స్త్రీ) పాలుఁగల నేలగుమ్మడుచెట్టు - బలపము

మహాసహా (స్త్రీ) తెల్లపెద్దగోరింటచెట్టు

మహాసేనః (పు) కుమారస్వామి - గొప్పసేనగలవాఁడు- శివుఁడు

మహీః (స్త్రీ) భూమి-నది-ముక్కు-చివర.
మహికా (స్త్రీ) మంచు.
మహిలా (స్త్రీ) ౫౮-సంవత్సరముల స్త్రీ-ప్రేంకణపుచెట్టు.
మహిలాహ్వయా (స్త్రీ) ప్రేంకణపుచెట్టు
మహిషః (పు) దున్నపోతు.
మహిషీ (స్త్రీ) గేదె-పట్టపుదేవి.
మహీక్షిత్ (పు) రాజు.
మహీధ్రః (పు) కొండ.
మహీరుహః (పు) వృక్షము.
మహీలతా (పు) ఎఱ్ఱ.
మహీసుతః (పు) అంగారకుఁడు-నరకాసురుఁడు.
మహేచ్ఛః (త్రి) పురుషార్థములయందధికేచ్ఛఁగలవాఁడు
మహేరణా (స్త్రీ) అందుగచెట్టు.
మహేశ్వరః (పు) శివుఁడు.
మహోక్షః (పు) ఆఁబోఁతు.
మహోత్పలమ్ (న) తామరపువ్వు
మహోత్సాహః } మహోద్యమః } (త్రి) దుష్కరప్రయోజనమంపెలియుద్యోగముఁగలవాఁడు
మహోన్నతః (పు) తాటిచెట్టు
మహౌషధమ్ (న) అతివస-వెల్లుల్లి-సొంటి
మా (స్త్రీ) మానము - చావు - శ్రీమొక్క-సడుము - తల్లి - (అ) నిషేధము - ఒద్దు.
మాః (పు) చంద్రుఁడు.
మాంసః (స్త్రీ) మాంసము.
మాంసలః (త్రి) బలిసినవాఁడు.
మాంసశష్కులః } మాంసశష్కులీ } (స్త్రీ) మాంసపుగాడె.

మాంసికః (పు) మృగపక్షిమాంసములమ్ముకొనెడివాఁడు.
మాంస్పచనః } మాంస్పాకిః } (త్రి) మాంసముతోవండినభక్ష్యములు
మాకన్దః (పు) మామిడిచెట్టు.
మాకన్దీ (స్త్రీ) ఉసిరికాయ
మాగధః (పు) వంశావళి- క్షత్రియస్త్రీకిని వైశ్యపురుషునికిఁ బుట్టినవాఁడు-జీలకఱ్ఱ-చెట్టు-భట్రాజు.
మాగధీ (స్త్రీ) అడవిమొల్ల - పిప్పలిచెట్టు.
మాఘః (పు) మాఘమాసము-మాఘకవి.
మాఘ్యా (స్త్రీ) మొల్లచెట్టు
మాఠరః (పు) సూర్యపార్శ్వచరులు.
మాణవకః (పు) ౧౬- సంవత్సరములువయస్సుగలపిల్లవాఁడు.
మాణవ్యమ్ (న) చిన్నవాండ్ర సమూహము.
మాణిబన్ధమ్ } మాణిమన్థమ్ } (న) సైంధలవణము.
మాతఙ్గః (పు) ఏనుఁగు - చండాలుఁడు-మాదిగవాఁడు.
మాతరపితరౌ (పు) తలిదండ్రులు
మాతరిశ్వా (పు) వాయువు
మాతలిః (పు) ఇంద్రునిసారథి.
మాతా (స్త్రీ) తల్లి- పార్వతి - సప్తమాతృకలు (త్రి) కొలిచెడువాఁడు.
మాతాపితరౌ (పు) తలిదండ్రులు.
మాతామహః (పు) తల్లితండ్రి
మాతామహాః (పు) తల్లివంశమువారు.
మాతామహీ (స్త్రీ) తల్లితల్లి
మాతుమ్ (అ) కొలిచేకొరకు,
మాతులః (పు) మేనమామ-ఉమ్మెత్తచెట్టు.

మాతులపుత్రకః (పుం) మేనమామకూఁతురు-ఉమ్మెత్తకాయ
మాతులా, మాతులానీ (స్త్రీ) మేనమామపెండ్లాము
మాతులాహిః (స్త్రీ) మర్లుఁబాము.
మాతులీ (స్త్రీ) మేనమామభార్య.
మాతులుఙ్గకః (పుం) మాదిఫలపుచెట్టు.
మాతృకా (స్త్రీ) సప్తమాతృకలు - తల్లి-రెండుపాదములతో రెండు మార్లుఁజిరగడము.
మాతృఘాతుకః (పుం) ఇంద్రుఁడు
మాతృష్వసా (పుం) తల్లితోడఁబుట్టినది
మాతృష్వసేయః, మాతృష్వస్రేయః (పుం) తల్లితోడఁబుట్టుకొడుకు
మాతృష్వస్రీయా (స్త్రీ) తల్లితోడఁబుట్టుకూఁతురు
మాత్రమ్ (న) నిశ్చయము
మాత్రా (స్త్రీ) అల్పపరిమాణము.
మాదృక్, మాదృక్షః, మాదృశః (త్రి) నావంటిది.
మాదవః (పుం) విష్ణువు-వైశాఖమాసము
మాధవకః (పుం) ఇప్పపువ్వులకల్లు.
మాధవీ (స్త్రీ) బండిగురివెందతీఁగె-కుందెనకత్తె-కల్లుబెల్లము.
మాధ్వీకమ్ (న) ఇప్పపువ్వులతోఁ జేసిన సారాయి.
మానమ్ (న) ప్రమాణము.
మానః (పుం) గర్వము
మానవః (పుం) మనుష్యుఁడు.
మానసమ్ (న) అభిప్రాయము.
మానసౌకాః (పుం) హంస.
మానినీ (స్త్రీ) స్త్రీ
మానుషః (పుం) మనుష్యుఁడు
మానుష్యకమ్ (న) మనుష్యసమూహము.
మాయా (స్త్రీ) రతీదేవి-పార్వతి-అవిద్య-లక్ష్మి-బుద్ధి-ఇంద్రజాలము మొదలగునవి - బుద్ధదేవునితల్లి
మాయాకారః (పుం) గారిడీవాఁడు
మాయాదేవీసుతః (పుం) బుద్ధదేవుఁడు.
మాయుః (ద్వి) పైత్యము
మాయూరమ్ (న) నెమళ్లగుంపు.
మారః (పుం) మన్మథుఁడు-మరణము.
మారజిత్ (పుం) బుద్ధదేవుఁడు.
మారణమ్ (న) చంపడము.
మారిషః (పుం) నాట్యభాషయందు పూజ్యుఁడు - నీఱుచిత్తిచెట్టు.
మారుతః (పుం) గాలి-మరువముచెట్టు.
మార్గః (పుం) మార్గశిరమాసము- కస్తూరి-విష్ణువు
మార్గణః (పుం) బాణము(త్రి)యాచకుఁడు.
మార్గశిరః, మార్గశీర్షః (పుం) మార్గశిరమాసము.
మార్గికః (పుం) బోయవాఁడు
మార్గితః (త్రి) వెదకఁబడినది.
మార్జనః (పుం) ఎఱ్ఱలొద్దుగుచెట్టు.
మార్జనా (స్త్రీ) నలుగుఁబెట్టుట.
మార్జనీ (స్త్రీ) చీపురు
మార్జారః, మార్జాలః (పుం) పిల్లి.
మార్జికా (స్త్రీ) పెఱుగులో ననేకద్రవ్యములుఁగూర్చిచేసినది.
మార్తణ్డః, మార్తాణ్డః (పుం) సూర్యుఁడు.

మార్దంగికః (పు) మద్దెలవాయించువాఁడు.
మార్ష్టిః (స్త్రీ) నలుగుఁబెట్టుట.
మాలః } (స్త్రీ) దిబ్బ, అనగా ఉన్నత
మాలంః } భూమి.
మాలతీ (స్త్రీ) జాజిచెట్టు
మాలా (స్త్రీ) పుష్పాలదండ - స్రక్కు
ఋముగ్రంథ్యము
మాలాకారః } (పు) పూలదండలమ్ము
మాలికః } వాఁడు
మాలీ (స్త్రీ) పూలదండ
మాలుధానః(పు)ఒకస్మె తలలోమరలుపా
మాలూరః (పు) మారేడుచెట్టు [ము
మాల్యమ్ (న) పూలదండ.
మాషః (పు) మినుములు - తృణధాన్యవి
శేషము
మాషపర్ణీ (స్త్రీ) కాఱుమినపచెట్టు.
మాషశః (అ) మినుపగింజమినుపగింజ
చొప్పననిచ్చువాఁడు.
మాషీణమ్ } (త్రి) మినుములుపండెడు
మాష్యః } క్షేత్రము.
మాసః (పు) నెల.
మాసరః (పు) గంజిమీఁదిమీఁగడ.
మాసికమ్ (న) మాసికము
మాస్మ (అ) ఒద్దు
మాహా (స్త్రీ) ఆవు.
మాహిష్యః (పు) క్షత్రియునికిని, వై
శ్యస్త్రీకినిఁబుట్టినవాఁడు
మాహేయీ (స్త్రీ) ఆవు.
మిత్రః (పు) సూర్యుఁడు-స్నేహితుఁడు
మిథః (అ) రహస్యము
మిథునమ్ (న) రాశివిశేషము- స్త్రీపురు
ష ద్వంద్వము

మిథ్యా (అ) అబద్ధము.
మిథ్యాదృష్టిః (స్త్రీ) నాస్తికత్వము
మిథ్యాభియోగః(పు) లేనిదిఆక్షేపించుట
మిథ్యాభిశంసనమ్ (న) లేనిదోషముమోపై
బెట్టుట.
మిథ్యామతిః (స్త్రీ) భ్రాంతి.
మిశ్రేయః } (పు) పిన్నసదాపచెట్టు.
మిసిః }
మిసే (స్త్రీ) జటామాంసి.
మిహికా (స్త్రీ) మంచు
మిహిరః (పు)సూర్యుఁడు-అగ్ని-చంద్రుఁ
మీఢమ్ (న) మూత్రము. [డు.
మీఢః (త్రి) విడిచినమూత్రాదులు.
మీనః (పు) చేప - రాశివిశేషము.
మీనకేతనః (పు) మన్మథుఁడు
మీమతి (ధా)ప-శప్-మీమగతౌ-పోవు
చున్నాఁడు
మీలతి (ధా)ప-శప్ - మీలనిమేషణే-
మూసుకొనుచున్నాఁడు.
ముకుటమ్ (న) కిరీటము.
ముకున్దః (పు) విష్ణువు- పాదరసము- ఒ
కానొకరత్నము
ముకురః (పు) అద్దము.
ముకులః (స్త్రీ) శరీరము - ఆత్మ (పు) అ
భినయహస్తవిశేషము
ముకుష్టకః (పు) అడవిపెసలు.
ముకూలకః (పు) దంతిచెట్టు.
ముక్తకంచుకః (పు) పొరవిడిచినపాము
ముక్తా (స్త్రీ) ముత్యము
ముక్తావలీ (స్త్రీ)అచ్చముత్తెములహారము.
ముక్తాస్ఫోటః (పు) } ముత్తెపుచిప్ప
ముక్తాస్ఫోటా (స్త్రీ) }

ముక్తిః (స్త్రీ) మోక్షము.

ముఖమ్ (న) నోరు-ముఖము-ఊరిముందటిభూమి

ముఖరః (త్రి) అక్కరలేనిమాటలు ప్రేలెడువాఁడు.

ముఞ్చతే (ధా) ఆ-శప్-ముచికల్కనే-ప్రకాశించుచున్నాఁడు - డంభముఁజేయుచున్నాఁడు.

ముఞ్జః (పు) అగ్నిమిణుగురులు - ముంజగడ్డి

ముఞ్జతి (ధా) ప-శప్-ముజిశబ్దార్థే-ధ్వనిఁజేయుచున్నాఁడు.

ముణ్ఠతే (ధా) ఆ-శప్ - ముఠిపాలనే-పాలించుచున్నాఁడు.

ముణ్డమ్ (న) శిరస్సు

ముణ్డః (త్రి) బోడితలవాఁడు.

ముణ్డతి (ధా) ప-శప్- ముడిప్రమర్దనే మర్దనముఁజేయుచున్నాఁడు.

ముణ్డతే (ధా) ఆ - శప్ - ముడిమార్జనే-శుద్ధిఁజేయుచున్నాఁడు- తిరస్కరించుచున్నాఁడు.

ముణ్డనమ్ (న) క్షౌరము.

ముణ్డితః (త్రి) బోడితలవాఁడు - గొఱగఁబడినది

ముణ్డీ (పు) మంగలివాఁడు - బోడతరపుచెట్టు

ముదా (స్త్రీ) సంతోషము.

ముదిరః (పు) తినడము.

ముద్గః (పు) పెసలు

ముద్గపర్ణీ (స్త్రీ) పిల్లపెసరచెట్టు.

ముద్గరః (పు) మల్లెచెట్టు-ఇనుపగుదియ-ఓమను

ముధా (అ) నిరర్థకము

మునిః (పు) బుద్ధదేవుఁడు - సుంబాదను గ్రంథ్యము - దశపర్యాద్ది - మునీశ్వరుఁడు

మునీన్ద్రః (పు) బుద్ధదేవుఁడు-మునిశ్రేష్ఠుడు.

మురజః (పు) మద్దెల.

మురా (స్త్రీ) మురయనుఓషధి.

ముషలీ (స్త్రీ) బల్లి

ముషితః (త్రి) దొంగిలింపఁబడినది

ముష్కః (పు) ముష్కమనెడుచెట్టు-వృషణములు.

ముష్కకః
ముష్కరః } (పు) మొక్కపుచెట్టు.

ముష్టిః (ద్వ)
ముష్టిబన్ధః (పు) } పిడికిలి.

ముసలః (స్త్రీ) రోకలి

ముసలీ (స్త్రీ) నేలతాడిచెట్టు - బల్లి - (పు) బలరాముఁడు-ఉడుము.

ముసల్యః (త్రి) రోకటిచేతఁజంపబడఁదగినవాఁడు.

ముస్తకః (పు)
ముస్తా (స్త్రీ) } తుంగముస్తెలు.

ముహుః (అ) మాటిమాటికి

ముహూర్తః (స్త్రీ) ౧౨ - క్షణముల కాలము

మూకః (త్రి) మూగవాఁడు

మూఢః (త్రి) అవివేకి - బాలుఁడు.

మూతః (త్రి) కట్టఁబడినకట్ట

మూత్రమ్ (న) మూత్రము.

మూత్రకృచ్ఛ్రమ్ (న) మూత్రరోగము.

మూర్ఖః (త్రి) అవివేకి.

మూర్ఛతి (ధా)ప-శప్- మూర్ఛాసముచ్ఛ్రాయయోః - మోహపడుచున్నాఁడు.

మూర్ఛా (స్త్రీ) సొమ్మసిలుట.

మూర్ఛాలః (పు) మూర్ఛరోగమువాఁడు.

మూర్ఛితః (పు) మూర్ఛరోగి,

మూర్తః (త్రి) కఠినమయినది.

మూర్తిః (స్త్రీ) శరీరము-కఠినత్వము.

మూర్తిమత్ (న) శరీరము.

మూర్ధజః (పు) తలవెంట్రుకలు

మూర్ధాభిషిక్తః (పు) రాజు-ప్రభువు

మూర్ధావసిక్తః (పు) బ్రాహ్మణపురుషుఁడుక్షత్రియస్త్రీకిఁబుట్టినవాఁడు

మూర్వా (స్త్రీ) చాగచెట్టు

మూలమ్ (న) పొదరిల్లు-వేరు-నక్షత్రవిశేషము - పాలు - పిండికలిపి చేసినపిండివంటభేదము

మూలకః (స్త్రీ) ముల్లంగిచెట్టు,

మూలకర్మ (న) మూలికలచేతనైన స్తంభనవశీకరణాదికర్మ

మూల్యమ్ (న) వెల-ధర-కూలి-జీతము,

మూషకః (పు) ఎలుక-కంసాలివాఁడు

మూషకపర్ణీ (స్త్రీ) ఎలుకచెవిచెట్టు

మూషా (స్త్రీ) సువర్ణాదిలోహములు, కరిగెడుమూస

మూషికః (పు) ఎలుక

మూషికా (స్త్రీ) ఆఁడెలుక

మూషితః (త్రి) దొంగలింపబడినది

మృగః (పు) లేడి - వేఁటాడెడివనుఁగు వెదకెడము - వేఁట-యాచనము - మృగశిరనక్షత్రము

మృగితా (పు) వెదకెడము

మృగతృష్ణా, మృగతృష్ణికా (స్త్రీ) ఎండమావులు.

మృగదంశకః (పు) కుక్క.

మృగధూర్తకః (పు)నక్క-ఎలుఁగుబంటి.

మృగనాభిః (ద్వి) కస్తూరి.

మృగబన్ధినీ (స్త్రీ) మృగములనుఁ బట్టువల

మృగమదః (పు) కస్తూరి.

మృగయా (స్త్రీ) వేఁట.

మృగయు, మృగవధాజీవః (పు) బోయవాఁడు

మృగవ్యమ్ (న) వేఁట.

మృగశిరః (న), మృగశిరా (స్త్రీ), మృగశిరాః(స్త్రీ), మృగశీర్షమ్(న), మృగశీర్షః(పు), మృగశీర్షా (స్త్రీ) — మృగశిరనక్షత్రము

మృగాఙ్కః (పు) చంద్రుఁడు.

మృగాదనః (పు) శివంగి

మృగితః (త్రి) వెదకఁబడినది

మృగేన్ద్రః (పు) సింహము.

మృడః (పు) శివుఁడు

మృడానీ (స్త్రీ) పార్వతి

మృణాలమ్ (స్త్రీ) తామరతీఁగె.

మృతమ్ (న) చావు

మృతః (త్రి) చచ్చినవాఁడు

మృతస్నాతః (త్రి) మృతస్నానముఁజేసినవాఁడు - సంస్కారముకొరకు స్నానముఁజేయించినశవము

మృతిః (స్త్రీ) మరణము.

మృత్తికా (స్త్రీ) మన్ను

మృత్యుః (ద్వి) చావు.

మృత్యుఞ్జయః (పు) శివుఁడు.
మృత్యునాశకః (పు) పాదరసము
మృత్యుపుష్పః (పు) చెఱకు
మృత్యుపుష్పన్ధయః (పు) వెగురు.
మృత్యుప్రసూనః (పు) చెఱకు.
మృత్సా (స్త్రీ) మన్ను
మృత్స్నా (స్త్రీ) తోవరిమన్ను.
మృద్ (స్త్రీ) మన్ను.
మృదఙ్గః (పు) మద్దెల
మృదు (న) మెత్తనిది
మృదుత్వక్ (పు) భుజపత్రిచెట్టు.
మృదురేచనీ (స్త్రీ) ఆవు
మృదురోమవాన్ (పు) చెవులపిల్లి
మృదులః (త్రి) మృదువైనది.
మృద్వీకా (స్త్రీ) ద్రాక్షచెట్టు
మృధమ్ (న) యుద్ధము
మృష్టః (త్రి) శుద్ధిచేసినది.
మృషా (అ) అబద్ధము.
మేఖలకన్యకా (స్త్రీ) నర్మదానది
మేఖలా (స్త్రీ) స్త్రీలమొలనూలు
మేఖలాపదమ్ (న) నడుము
మేఘః (పు) మేఘము.
మేఘడిమ్బరమ్ (న) రాజులకుఁబట్టెడు నల్లనిగొడుగు
మేఘనాదానులాసకః, మేఘనాదానులాసీ (పు) నెమలి
మేఘనామా (పు) కోలతుంగముస్తెచెట్టు
మేఘపుష్పమ్ (న) జలము
మేఘమాలా (స్త్రీ) మేఘములవరస
మేఘవాహనః (పు) ఇంద్రుఁడు
మేఢ్రః (పు) శిశ్నము
మేణ్ఢః (పు) గొఱ్ఱెపోతు.

మేదస్కృత్ (న) మాంసము.
మేదినీ (స్త్రీ) భూమి.
మేదురః (త్రి) చిక్కనైనలువుఁగలది.
మేధా (స్త్రీ) ధారణాశక్తిగలబుద్ధి
మేధిః (స్త్రీ) కళ్లము-మేడికోల.
మేధ్యః (త్రి) పవిత్రమైనది
మేపతే (ధా) ఆ-శప్ - మేపృగతౌ- పోవుచున్నాఁడు
మేరుః (పు) మేరుపర్వతము
మేవతే (ధా) ఆ - శప్ మేవృసేవనే- సేవించుచున్నాఁడు.
మేలకః (పు) కూటమి
మేషః (పు) పొట్టేలు
మేషకమ్బళః (పు) గొఱ్ఱెవెంట్రుకలచేతఁజేయఁబడిన వస్త్రము, రేశకంబళి
మేషీ (స్త్రీ) గొఱ్ఱె
మేహః (పు) మేహమనురోగము.
మేహనమ్ (న) శిశ్నము.
మైత్రావరుణిః (పు) అగస్త్యుఁడు.
మైథిలీ (స్త్రీ) సీతాదేవి
మైథునమ్ (న) స్త్రీసంగమము.
మోఘః (త్రి) ప్రయోజనములేనిది.
మోఘా (స్త్రీ) కలిగొట్టుచెట్టు.
మోచకః (పు) మునగచెట్టు.
మోచా (స్త్రీ) అరఁటిచెట్టు- బూరుగుచెట్టు.
మోజతి (ధా) ప - శప్ - ముజశబ్దార్థే- ధ్వనిఁజేయుచున్నాఁడు.
మోదతే (ధా) ఆ- శప్ - సంతోషించుచున్నాఁడు
మోరటమ్ (న) చల్ల-చెఱకువేరు
మోరటా (స్త్రీ) చాఁగచెట్టు.

మోషకః (పు) కంసాలివాఁడు - దొంగ వాఁడు.
మోహః (పు) మూర్ఛ - అవిద్య-అరివ ర్గాగణావిశేషము - స్త్రీలనుఁజూచుటచేఁగలుగుసంతోషము
మోక్షః (పు) మోక్షము, అనగావిడిచిపెట్టడము-మొక్కఁపుచెట్టు
మౌద్గీనః (త్రి) పెసలుపండెడునేల.
మౌనమ్ (న) మాట్లాడకుండుట.
మ్రక్షణమ్ (న) తైలము
మ్రదిష్ఠః (త్రి) మిక్కిలిమృదువైనది.
మ్లక్షణమ్ (న) అభ్యంజనము, అనగానూనెచేశరీరమంతయును రాచుకొనడము
మ్లానిః (స్త్రీ) వాడడము
మ్లేచ్ఛః (పు)నీచజాతివాఁడు-ఇంగిలీకము
మ్లేచ్ఛకన్దః (త్రి) తెల్లవుల్లి
మ్లేచ్ఛితమ్ (త్రి) మ్లేచ్ఛభాష.

## య

యః (పు) త్యాగము - స్థానము-వాయువు - యముఁడు - బ్రహ్మ- తల్లి-కామము - కీర్తి.
యకృదాత్మికా (స్త్రీ) గబ్బిలము.
యజమానః (పు) యజ్ఞముఁజేసినవాఁడు
యజుః (న) యజుర్వేదము.
యజ్ఞః (పు) యజ్ఞము.
యజ్ఞసూత్రమ్ (న) జందెము.
యజ్ఞాఙ్గః(పు) మేడిచెట్టు-చిఱుతేఁకుచెట్టు
యజ్ఞియమ్(త్రి) యజ్ఞకర్మకుతగినవస్తువు
యజ్ఞోపవీతమ్ (న) జందెము-పైబట్ట
యజ్వా (పు) యథాశాస్త్రముగయజ్ఞముఁజేసినవాఁడు

యత్
యతః } (అ) హేతువు
యతతే (ధా) ఆ-శప్- ప్రయత్నముఁజేయుచున్నాఁడు
యతిః (పు)ఇంద్రియనిగ్రహముఁగలవాఁడు
యథా (అ)పోలిక-వలెను-ఏలాగో
యథాజాతః (త్రి) అవివేకి,
యథాతథా (అ) ఏమయిన.
యథాయథమ్ (అ) తమతమవస్తువులు - తామతామనే అర్థము
యథార్థమ్ (త్రి) సత్యము
యథార్హవర్ణః (పు) వేగులవాఁడు
యథేప్సితమ్ (న) యథేష్టమయినది.
యదా (అ) ఎప్పుడు.
యది (అ) పక్షాంతరము - ఐతే అట్లాయెనా
యదృచ్ఛా (స్త్రీ) యథేచ్ఛముగా.
యద్వా (స్త్రీ) పక్షాంతరము.
యన్తా (పు) రథసారథి - మావటీఁడు.
యమః
యమరాట్ } (పు) యముఁడు.
యమునా (స్త్రీ) కాళిందీనది- పార్వతి.
యమునాభ్రాతా (పు) యముఁడు.
యయుః (పు) అశ్వమేధయాగమునకుతగినగుఱ్ఱము - బ్రాహ్మణుఁడు.
యవః (పు) గోధుమలు - యవలనెడుధాన్యము.
యవకః (పు) కాఱుమినుములు.
యవక్యమ్(త్రి)-చిన్నయవలుపండెడినేల
యవక్షారః (పు) యవక్షారము
యవనికా (స్త్రీ) తెర-తెరచీర- పరదా
యవఫలః (పు) వెదురు- ఉల్లిచెట్టు.

యవసమ్ (న) గడ్డి.
యవాగూః (స్త్రీ) గంజి.
యవాగ్రజః (పు) యవక్షారము
యవానికా } (స్త్రీ) ఓమము.
యవానీ
యవీయసీ (స్త్రీ) చెల్లెలు.
యవీయాన్ (పు) తమ్ముఁడు.
యవ్యః (పు) యవలు పండెడు నేల
యశః (న) కీర్తి.
యష్టిమధుకమ్ (న) యష్టిమధుకపు చెట్టు.
యష్టా (పు) యజ్ఞముఁజేయువాఁడు
యష్టిః (ద్వి) చేపట్టుకఱ్ఱ
యక్షరాట్ } (పు) కుబేరుఁడు-యక్ష
యక్షః　　జాతి.
యక్ష్మః (పు) క్షయరోగము
యాగః (పు) యజ్ఞము
యా (స్త్రీ) వాహనము-కాంతి-లక్ష్మి.
యాచకః } (త్రి) యాచకుఁడు
యాచనకః
యాచనా (స్త్రీ) అడగడము
యాచితకమ్ (న) ఎరువడిగి తెచ్చుకొనినది
యాచ్ఞా (స్త్రీ) యాచన - భిక్ష
యాజకః (పు) యజ్ఞముఁజేయించు వాఁడు, అనగా ఋత్విక్కు
యాతనా (స్త్రీ) నరకతీవ్రవేదన
యాతయామమ్ (త్రి) అనుభవించఁబడినది
యాతా (స్త్రీ) తోడికోడలు- అత్త- మేనమామభార్య
యాతు (న) } రాక్షసుఁడు
యాతుధానః (పు)
యాత్రా (స్త్రీ) తీర్థపోవుము　　[డు
యాదఃపతిః (పు) సముద్రుఁడు-వరుణుఁ

యాదవమ్ (న) ఆవులు గేదెలు మొదలగు వాని లెక్క.
యాదవః (పు) శ్రీకృష్ణుఁడు
యాదసాంపతిః } (పు) వరుణుఁడు- స
యాదస్పతిః　　ముద్రుఁడు.
యాదృక్ (త్రి) ఎటువంటిదో.
యాదృక్షః } (త్రి) ఏలాగంటిదో.
యాదృశః
యానమ్ (న) దండె త్తిపోవడము-సకలమైన వాహనములు.
యానపాత్రమ్ (న) నడిచెడు యోడ
యానముఖమ్ (న) వాహనపు ముందటి భాగము
యాప్యః (త్రి) ఆచారాదినిందితుఁడు.
యాప్యయానమ్ (న) పాలకి.
యామః (పు) జాము
యామినీ (స్త్రీ) రాత్రి.
యామీ (స్త్రీ) రాత్రి - కులస్త్రీ)
యామునమ్ (న) సౌవీరాంజనశిల.
యాయజూకః (పు) పలుమాఱు యజ్ఞముఁ జేయుటయందు స్వభావముఁగలవాఁడు
యావః (పు) లక్క-లత్తుక.
యావకః (పు) కాఱుమినుములు
యావత్ (అ) ఎంతో-ఎందాక-ఎంతమాత్రము - ఎన్నడో
యావనః (పు) అందుగుబంకతోఁజేసిన ధూపద్రవ్యము
యాష్టికః (పు) దుడ్డుకఱ్ఱఁబట్టెడువాఁడు
యాసః (పు) పిన్నరేగిటిచెట్టు-దూలగొండి
యుక్తః (త్రి) న్యాయమైనది　　[చెట్టు
యుక్తరసా (స్త్రీ) పిప్పింగిచెక్క

యుగమ్ (న) కృతాదియుగములు-జంట-నాలుగుచేతులప్రమాణము.

యుగః (పు) కాఁడి.

యుగన్ధరః (సీ) రథమునకుఁ కాఁడికినివేసి నవాఁగ.

యుగపత్ (అ) ఒకేసారి.

యుగపత్రకః (పు) దేవకాంచనపుచెట్టు.

యుగపార్శ్వగః (పు) కాఁడిమోసెడు యెద్దులవద్ద అభ్యాసముకొరకుఁ గట్టినయెద్దు.

యుగలమ్ } (న) వస్తుద్వయము
యుగ్మమ్ }

యుజ్ఝతి (ధా) ప - శప్ - విడుచుచున్నాఁడు.

యుచ్ఛతి (ధా) ప-శప్-యుచ్ఛప్రమాదే-పొరబాటుఁబడుచున్నాఁడు.

యుద్ధమ్ (న) రణము - విల్లు.

యువతీ (సీ) ఆఁడుది- ఎఱ్ఱఅడవిమొల్ల,

యువా (పు) ప్రాయపువాఁడు.

యూకా (సీ) పేను.

యూతిః (సీ) కలపడము.

యూథమ్ (న) తిర్యగ్జంతుసమూహము

యూథనాథః } (పు) ముఖ్యమైన ఏనుఁగు, అనగాగజరాజు.
యూథపః }

యూథికా (సీ) అడవిమొల్ల [ము.

యూపః (సీ) యజ్ఞపశువునుకట్టుస్తంభ

యూపకటకః (పు) యూపస్తంభమునందుకొయ్యతోఁజేసినకడియము.

యోక్త్రమ్ (న) పలుపు.

యోగః (పు) ధ్యానము-యుక్తి - ఉపాయము-కూటమి - లెక్కకుకలియఁగూడడము - సన్నహనము.

యోగేష్టమ్ (న) సీసము.

యోగ్యమ్ (న) యోగ్యము - బుద్ధివృద్ధి యను ఓషధి. [తుఁడు.

యోగ్యః (త్రి) నిపుణుఁడు-ఉపాయవం

యోజనవల్లీ (సీ) మంజిష్ఠచెట్టు.

యోతతే (ధా) ఆ - శప్ - ప్రకాశించుచున్నాఁడు.

యోత్రమ్ (న) పలుపు.

యోద్ధా } (పు) బంటు.
యోధః }

యోనిః (ద్వి) భగము.

యోనిరఞ్జనమ్ (న) స్త్రీలబుతువు.

యోషా }
యోషిత్ } (సీ) ఆఁడుది.
యోషితా }

యోటతి (ధా) ప-శప్ - యోట్బంధనే-కట్టుచున్నాఁడు.

యౌతకమ్ (న) పరిమాణము.

యౌతుకమ్ (న) అల్లునికి, కూతునికిచ్చినసొమ్ము.

యౌవతమ్ (న) యువతీసమూహము-యవ్వనము-పరిమాణము.

యౌవనమ్ (న) ౧౬ - సంవత్సరములు మొదలు ౫౦ - సంవత్సరములపరియంతముండునయస్సు.

## ర

రమ్ (న) ధ్యానము-కడుపు - వంకర-భయము- మన్మథుఁడు- నాశము- వజ్రము బాణము-హస్తము.

ర. (పు) అగ్ని.

రక్తమ్ (న) కుంకుమము-తామ్రము-శిరస్సు - నెత్తురు.

రక్తః (త్రి) ఎఱుపువణాము గలవాఁడు- అనురక్తుఁడు
రక్తకః (పు) అశోకవృక్షము - ఎఱ్ఱనివస్త్రము
రక్తచిత్రకః (పు) ఎఱ్ఱచిత్రమూలము.
రక్తపా
రక్తపాః } (స్త్రీ) జెలగ.
రక్తపాతా
రక్తపాయినీ } (స్త్రీ) జెలగ
రక్తపుచ్ఛికా (స్త్రీ) నల్లికండ్లపాము.
రక్తఫలా (స్త్రీ) దొండచెట్టు.
రక్తసన్ధ్యకమ్ (న) ఎఱ్ఱతామర
రక్తసరోరుహమ్ (న) ఎఱ్ఱఁతామర
రక్తాఙ్గః (పు) కంపిల్లమను(గంధ్యము
రక్తేక్షుః (పు) ఎఱ్ఱచెఱకు
రఖతి (ధా) ప - శప్ - నడుచుచున్నాఁడు
రఘుః (పు) రఘుమహారాజు
రఙ్కుః (త్రి) దరిద్రుఁడు-జెట్టివాఁడు
రఙ్కుః (పు) తెల్లదుప్పి
రఙ్ఘతి (ధా) ప-శప్-నడుచుచున్నాఁడు
రఙ్గమ్ (న) తగరము
రఙ్గః (పు) నాట్యస్థలము - (పేమ-యుద్ధము - ధ్వని
రఙ్గతి (ధా) ప-శప్-నడుచుచున్నాఁడు
రఙ్గదః (పు) కవిరి
రఙ్గాజీవః (పు) చిత్రకారుఁడు- అనగా ముచ్చెవాఁడు
రజః (న) రజోగుణము- రజస్వలనెత్తురు-ధూళి
రజకః (పు) చాకలివాఁడు-చిలుక
రజకీ (స్త్రీ) చాకలిది.
రజతమ్ (న) రక్తము-వెండి.
రజనీ (స్త్రీ) రాత్రి-కోరిందచెట్టు
రజనీజలమ్ (న) మంచు
రజనీముఖమ్(న) (పదోషము.
రజస్వలా (స్త్రీ) ముట్టయినస్త్రీ.
రజ్జుః (త్రి) తాఁడు
రటతి (ధా) ప - శప్ - రటపరిభాషణే-మాట్లాడుచున్నాఁడు.
రరతి (ధా) ప- శప్ - రరపరిభాషణే-సంభాషించుచున్నాఁడు.
రణః (స్త్రీ) యుద్ధము,
రణతి (ధా) ప-శప్-రణశబ్దే - ధ్వనిఁజేయుచున్నాఁడు
రణ్డా (స్త్రీ) వెధవరాలు - ఎలుకచెవిచెట్టు
రతమ్ (న) స్త్రీసంగమము.
రతిపతిః (పు) మన్మథుఁడు.
రత్నమ్ (న) నవరత్నములలోనొకటి-(శేష్ఠమైనది
రత్నసానుః (పు) మేరుపర్వతము - కైలాసము-హిమాలయము,
రత్నాకరః (పు) సముద్రుఁడు
రత్నిః (ద్వి) పిడికిలి.
రథః (పు) దేహము-నేత్రము- తేలు-(ప్పచెట్టు
రథకట్యా (స్త్రీ) రథసమూహము
రథకారః (పు) కరణజాతిస్త్రీయందు మాహిష్యజాతిపురుషునివలనఁబుట్టినవాఁడు - వడ్లవాఁడు
రథగుప్తిః (పు) రథసంరక్షణార్థం గప్పెడ చర్మము
రథద్రుమః (పు) మెమ్మిచెట్టు

రథాఙ్గమ్ (న) రథచక్రము.
రథాఙ్గాహ్వయనామకః(పు)చక్రవాకిపక్షి.
రథికః
రథిరః
రథీ
రథినః } (పు)రథయుద్ధమునకుశలుఁడు.
రథ్యః (పు) రథములాగు గుఱ్ఱము.
రథ్యా (స్త్రీ) రథము వెళ్లుటకు యోగ్యమైనవీథి - రథసమూహము.
రదః
రదనః } (పు) పల్లు.
రదనచ్ఛదః (పు) పెదవి.
రపతి (ధా) ప-శప్- చీల్చుచున్నాఁడు.
రన్ధ్రమ్ (న) బిలము.
రపతి (ధా)ప-శప్ - రపన్వ్యక్తానాంవాచి - మాట్లాడుచున్నాఁడు.
రఫతి (ధా) ప-శప్- రఫగతౌ - పోవుచున్నాఁడు.
రమణీ (స్త్రీ) క్రీడించుయాఁడుది.
రమ్ఫతి (ధా) ప-శప్- రంఫగతౌ - పోవుచున్నాఁడు.
రమ్బతే (ధా) ఆ - శప్- రబిశబ్దే - ధ్వనిచేయుచున్నాఁడు
రమ్భతే (ధా) ఆ-శప్ - రభిశబ్దే - ధ్వనిఁజేయుచున్నాఁడు.
రమ్భా(స్త్రీ)స్వర్గమునందుండువేశ్య-పాయ(ఱ)తి
రయః (పు) వేగము
రయతే(ధా)ఆ-శప్- రయగతౌ- పోవుచున్నాఁడు
రల్లకః (పు) గొంగళి.
రవః (పు) ధ్వని
రవణః (త్రి) పిత్తళ్ళ.
రవిః (పు) సూర్యుఁడు
రశనా (స్త్రీ) స్త్రీలమొలనూలు.
రశ్మిః(పు)కిరణము-గుఱ్ఱపుకళ్లెములగాము.
రసః (పు) ద్రవము-ముద్దపప్పు - పాదరసము-అనురాగము- బంగారము-శాలింతబోలు-రుచి.
రసగర్భమ్ (న) రసాంజనము.
రసజ్ఞా (స్త్రీ) నాలుక.
రసనా (స్త్రీ) స్త్రీలమొలనూలు-నాలుక.
రసవతీ (స్త్రీ) వంటయిల్లు.
రసా (స్త్రీ) భూమి - అందుగుచెట్టు-సవిరేలచెట్టు.
రసాఞ్జనమ్ (న) రసాంజనము.
రసాతలమ్ (న) పాతాళము.
రసాలః (పు) మామిడిచెట్టు-చెఱకు.
రసాలా (స్త్రీ) ద్రాక్షచెట్టు-చెఱకు - పెరుగులోననేకద్రవ్యములువేశిచేసినది.
రసితమ్ (న) ఉఱుము
రసోనకః (పు) వెల్లుల్లి.
రహః (న) ఏకాంతస్థలము-భయము.
రహస్యః (త్రి) ఏకాంతస్థలమందుఁబుట్టినమాట
రక్షః (న) రావణాదిరాక్షసజాతి. (పు) రక్షించడము
రక్షా (స్త్రీ) లత్తుక-లక్క.
రక్షితః (త్రి) రక్షింపఁబడినది.
రక్ష్యః (త్రి) రక్షించదగినది.
రా (స్త్రీ) దానము-బంగారము-నడుచుట
రాః (పు) శబ్దము (ద్వి) బంగారము.
రాకః (పు) సూర్యుఁడు.
రాకా (స్త్రీ) మొదటనరజస్వల-పూర్ణచంద్రుఁడుగలపున్నమ.

రాఖతి (ధా) ప-శప్-పీల్చుచున్నాడు-పూర్తిజేయుచున్నాఁడు
రాగః (పు) గీతము-అనురాగము-చంద్రుడు-సూర్యుడు-లత్తుక
రాగిణీ (స్త్రీ) ఎఱ్ఱతోటకూర
రాఘవః (పు) శ్రీరాములు.
రాఘవాయణః (పు) రామాయణము.
రాఘతే (ధా)ఆ-శప్-సమర్థించుచున్నాడు
రాఙ్కవమ్ (త్రి) శాలువ.
రాజకమ్ (న) రాజసమూహము
రాజన్యః (పు)క్షత్రియుఁడు-రాజపుత్రుడు-అగ్ని
రాజన్యకమ్ (న) క్షత్రియసమూహము.
రాజన్వాన్ (త్రి)మంచిరాజుగలదేశము
రాజబలా (స్త్రీ) గొంతెమగోరుచెట్టు.
రాజబీజీ (త్రి) రాజవంశమునందుఁబుట్టినవాఁడు
రాజరాజః (పు) కుబేరుఁడు-దుర్యోధనుడు-శివుఁడు
రాజర్షిః (పు) ఋతుపర్ణాదిరాజులు.
రాజవంశ్యః (త్రి) రాజవంశమునబుట్టినవాఁడు.
రాజవృక్షః (స్త్రీ) కసెందచెట్టు.
రాజసదనమ్ (న) రాజగృహము.
రాజసూయమ్ (న) యజ్ఞభేదము
రాజహంసః (పు) ఎఱ్ఱనిముక్కు-కాళ్లుగలతెల్లనిహంస.
రాజా (పు) చంద్రుఁడు-క్షత్రియుఁడు-ఇంద్రుఁడు-సూర్యుఁడు- పరమాత్మ-చేఁతిపొట్ట.
రాజాదనమ్ (న) మొగలిచెట్టు-పాలచెట్టు
రాజార్హమ్ (న) అగురుచెట్టు
రాజిః (స్త్రీ) వట్టమైనపఙ్క్తి.
రాజికా (స్త్రీ) సలావాలు-వాలు.
రాజిలః (పు) రెండుతలలపాము
రాజీవః (పు) గొప్పనేత్రములుగలచేప.
రాట్ (పు) రాజు.
రాత్రకః (పు) విటుఁడు
రాత్రిచరః } (పు) రాక్షసుఁడు.
రాత్రిఞ్చరః }
రాత్రిపుష్పీ (స్త్రీ) జాజి
రాత్రీ (స్త్రీ) రాత్రి
రాధః (పు) వైశాఖమాసము
రాధా (స్త్రీ) కాంతి - విశాఖనక్షత్రము-గోపికావిశేషము-మెఱుపు
రాధాకాన్తః (పు) శ్రీకృష్ణుఁడు.
రాధాతనయః (పు) కర్ణుఁడు
రామమ్ (న) చక్రవర్తికూరచెట్టు
రామః (పు) బలరాముఁడు-శ్రీరాములు-పరశురాముఁడు- విష్ణువు-బ్రహ్మ-శివుఁడు.
రామఠమ్(న)ఇంగువు.
రామా (స్త్రీ) కామశాస్త్రమునందు ప్రవీణతగలస్త్రీ.
రావణః (పు) రావణాసురుఁడు - ధ్వని-చిట్టితుమికిచెట్టు-బలుఁరక్కసిచెట్టు.
రాశిః (ద్వి) మేషాదిరాసులు- ధాన్యసమూహము.
రాష్ట్రమ్ (న) దేశము-ఉపద్రవము.
రాష్ట్రికా (స్త్రీ) వాఁకుడుచెట్టు
రాష్ట్రియః (పు) రాజుపెండ్లాముతోడబుట్టినవాఁడు
రాసభః (పు) గాడిద,
రాస్నా (స్త్రీ) పిరంగిచెక్క-సన్నరాస్నపుచెట్టు.

రాహుః (పు) రాహుగ్రహము-త్యాగము
రాహుత్తః (పు) గుఱ్ఱపురౌతు.
రాక్షసః (పు) రాక్షసుఁడు- బలురక్కసిచెట్టు.
రాక్షసీ (స్త్రీ) రాక్షసస్త్రీ - చండయను గ్రంథ్యము
రాక్షా (స్త్రీ) లత్తుక-లక్క.
రిః (స్త్రీ) ఇచ్ఛ-కాంతి
రికమ్ (న) త్వరితము-చిత్రము-వ్యవహార[ము
రిక్తః (త్రి) శూన్యము
రిక్తికా (స్త్రీ) మఱఁదలు.
రిఙ్ఖః(పు)ఒప్పుకొనిలేదనిపోట్లాడడము
రిఙ్ఖణమ్ (న) జారడము
రిఙ్ఖా (స్త్రీ) గుఱ్ఱపుడెక్క.
రిఙ్గనమ్ } (న) జారడము.
రిఙ్గణమ్ }
రిఙ్గతి (ధా) ప-శప్-నడుచుచున్నాఁడు
రిత్తికా (స్త్రీ) మఱదలు
రిపుః (పు) శత్రువు-చండయను గ్రంథ్యము
రిష్టమ్ (న) శుభము-క్షేమము-పాపము-నాశము
రిష్టిః (పు) ఖడ్గము-సమృద్ధి
రీఢా (స్త్రీ) తిరస్కారము.
రీణః (త్రి) కాఱినవస్తువు
రీతిః (స్త్రీ) ఇత్తడి- కారడము.
రుక్ (స్త్రీ) ఒకుగ్వాసము-లేఁగుస్సు
రుక్మమ్ (న) బంగారము
రుక్మకారకః (పు) అగసాలవాఁడు
రుక్మిణీ (స్త్రీ) రుక్మిణీదేవి
రుగ్ణః (త్రి) వంగినది-విరిగినది
రుచకమ్ (న) సౌవర్చలలవణము - స క్షారము

రుచిః (స్త్రీ) సూర్యకాంతి - అత్యాసక్తి- ఇచ్ఛ
రుచిరమ్ } (త్రి) చక్కనిది
రుచ్యః }
రుజా (స్త్రీ) రోగము-భంగము
రుంటతి (ధా) ప-శప్ -రుటిస్తేయే-దొంగతనముఁజేయుచున్నాఁడు
రుంఠతి (ధా) ప-శప్- రుఠిగతౌ-పోవుచున్నాఁడు
రుణ్డతి (ధా) ప-శప్ - దొంగతనముఁజేయుచున్నాఁడు
రుత్ (స్త్రీ) దుఃఖహేతువు-దుఃఖము-రోగము-శబ్దము
రుద్ధః (త్రి) పొదగఁబడినది
రుద్రః (పు) ఏకాదశరుద్రగణదేవతలు-శివుఁడు-అగ్ని-యజ్ఞము.
రుద్రాణీ (స్త్రీ) పార్వతి
రుధిరమ్ (న) రక్తము.
రున్ద్రిమ్ (త్రి) గొప్పది
రురుః (పు) నల్లచారలు, తెల్లమచ్చలుఁగలదుప్పి
రుశత్ (త్రి) అశుభవాక్కు
రుషా (స్త్రీ) క్రోధము
రుషిః (పు) వ్యాసాదిమునులు
రుహా (స్త్రీ) గరికెగడ్డి
రూః (స్త్రీ) రూపము-ధ్వని-భయము
రూపాజీవా (స్త్రీ) వేశ్య - లంజ
రూప్యమ్ (న) వెండి, బంగారు, రాగి నాణ్యములు- వెండి
రూక్షః (పు) వృక్షము
[illegible] (త్రి) హేమునిపిలువకొని-పిలి
[illegible] (పు) [illegible]

లష్ (న) లవణము,

లః (పు) ఖండనము - లక్ష్మి - విష్ణువు - ఇంద్రుఁడు.

లకుచః (పు) గజనిమ్మచెట్టు - కమ్మరేఁగు చెట్టు

లఖతి (ధా) ప-శప్-నడుచుచున్నాఁడు

లగుః (పు) భూప్రదేశము - మృగము.

లగ్నమ్ (న) రాశ్యుదయము.

లగ్నకః (పు) పూఁటకాఁపు

లఘుః (పు) నీటిమీఁదనుంచగా దబ్బున మునుగకపోవుట- ఎగరడము.

లఘులయమ్ (న) తెల్లవట్టివేలు.

లఙ్కా (స్త్రీ) రావణునిపట్టణము- లంక ఒనెమువడ్లు.

లఙ్కినీ (స్త్రీ) సుజ్జుపుకల్లెము.

లఙ్కోయికా (స్త్రీ) స్పృక్కాయనుగ్రంథ్యము.

లఙ్ఘతి } (ధా) ప - శప్ - నడుచుచు
లఙ్గతి } న్నాఁడు.

లఙ్ఘతి (ధా) ప-శప్-లఘిశోషణే- ఎండింపచేయుచున్నాఁడు.

లఙ్ఘతే (ధా) ఆ-శప్-పోవుచున్నాఁడు.

లచ్ఛతి (ధా) ప-శప్-లచ్ఛలక్షణే - చిహ్నగాచేయుచున్నాఁడు

లజతి } (ధా) ప-శప్-లజలభర్జనే - వే
లఞ్జతి } యించుచున్నాఁడు

లజ్జా (స్త్రీ) లజ్జ

లజ్జితః (త్రి) సిగ్గుపడినవాఁడు.

లటతి (ధా) ప-శప్-లటభాష్యే - క్రీడించుచున్నాఁడు.

లడతి (ధా) ప-శప్-లడవిలాసే - విలాసముచేయుచున్నాఁడు

లడ్డుకః (పు) లడ్డూలు

లతా (స్త్రీ) తీగె - కొమ్మ - ప్రేంకణపు చెట్టు - పాలెపురుగు

లతాప్రతానినీ (స్త్రీ) తీగెలుగలపొదజెల్లు.

లతార్కః (పు) పచ్చనీయుల్లి

లపనమ్ (న) నోరు - ముఖము

లపతి (ధా) ప-శప్- లపవ్యక్తానాంవచి- మాట్లాడుచున్నాఁడు.

లపితమ్ (న) వాక్కు

లపితః (త్రి) చెప్పఁబడినది

లబ్ధః (త్రి) పొందబడినది

లబ్ధవర్ణః (పు) విద్వాంసుఁడు

లమ్బతే (ధా) ఆ-శప్-లబిశబ్దే-అవస్రంసనే చ- ధ్వనిఁజేయుచున్నాఁడు

లమ్బనమ్ (న) } మెడలోపేరు.
లమ్బమానమ్ (త్రి) }

లమ్బోదరః (పు) వినాయకుఁడు

లయగతి (ధా) ప-శప్-లయణ్యాగతిప్రేరణశ్లేషణేషు-గమనముచేయుచున్నాఁడు- ప్రేరణచేయుచున్నాఁడు-కలుసుకొనుచున్నాఁడు.

లర్బతి (ధా) ప-శప్-లర్బగతౌ - వెళ్లుచున్నాఁడు.

లలనా (స్త్రీ) విలాసవతి - జిహ్వ - నారీభేదము

లలనికా (స్త్రీ) మెడలోపేరు.

లలాటః (పు) నుదురు

లలాటికా (స్త్రీ) పాపిటబొట్టు

లలామ } (న) తిలకము - భూషణము- గుఱ్ఱము
లలామమ్ }

లలామకః (పు) సిల్లిఁజుట్టునఁగట్టినగంధ

లలితమ్ (న) శృంగారచేష్ట-విలాసము

లవః (పు) కొంచమైనది - చేనుకోత - శ్రీరామునికొమారుఁడు
లవఙ్గమ్ (న) లవంగము
లవణమ్ (న) ఉప్పు
లవణోదః (పు) ఉప్పుసముద్రము
లవనమ్ (న) చేనుకోత.
లవిత్రమ్ (న) కొడవలి
లశునమ్ (న) వెల్లుల్లి,
లష్టకః (పు) వింటినడుము
లక్షమ్, లక్షణమ్ } (న) గుఱి
లక్షణా (స్త్రీ) అఁడుగుదెస్గరుచెట్టు
లక్ష (న) చిహ్నము - ప్రధానము
లక్ష్మణః (పు) లక్ష్మణుఁడు
లక్ష్మీ(స్త్రీ)లక్ష్మి -సంపద-బుద్ధియనుఓషధి
లక్ష్యమ్ (న) గుఱి
లా (స్త్రీ) నేత్రము- దానము-గ్రహణము
లాఖతి (ధా) ప- శప్ - పీల్చుచున్నాఁడు-పూర్తిఁజేయుచున్నాఁడు
లాఘవమ్ (న) ఆరోగ్యము-లఘుత్వము
లాఙ్గలమ్ (న) నాగలి
లాఙ్గలపద్ధతిః (స్త్రీ) నాగటిచాలు
లాఙ్గలికా, లాఙ్గలికీ } (స్త్రీ) దూలగొండిచెట్టు
లాఙ్గలీ (పు) టెంకాయచెట్టు
లాఙ్గూలమ్ (న) తోఁక
లాఞ్ఛతి (ధా) ప-శప్-లాంఛలక్షణే-చిహ్నగాచేయుచున్నాఁడు
లాఞ్ఛనమ్ (న) చిహ్నము-గుఱుతు
లాజః (పు) పేలాలు
లాజతి, లాఞ్జతి } (ధా) ప - శప్- లాజలాఞ్జ భర్త్సనే- బెదిరించుచున్నాఁడు

లాపః (పు) లాభము - వడ్డి
లామజ్జకమ్ (న) తెల్లవట్టివేళ్లు
లాలసః (ద్వి) ప్రార్థన - ఇష్టవస్తువునకొఱకు అనురాగము - విషయాసక్తుఁడు
లాలా (స్త్రీ) చొంగ
లాలాటికః (త్రి) ప్రభుభావమునుఁదెలుసుకొనువాఁడు-నీచుఁడు
లాలాటికా (స్త్రీ) చేరుచుక్క-బొట్టు.
లావః, లావకః } (పు) లావుకపిట్ట.
లాసకీ, లాసికా } (స్త్రీ) నాట్యస్త్రీ
లాస్ఫోటనీ (స్త్రీ) రత్నాలుదొలిచెడిపిడి
లాస్యమ్ (న) నాట్యము [సాన.
లాక్షా (స్త్రీ) లక్క - లత్తుక.
లాక్షాప్రసాదనః (పు)ఎఱ్ఱలొద్దుగచెట్టు
లిః (పు) శ్రమ-ఐక్యము-నాశనము-శ్లేషము - సామ్యము
లికుచః (పు) కర్పూరేఁగు - గజనిమ్మ
లిఖితమ్ (న) వ్రాత
లిఙ్గతి (ధా) ప-శప్-నడుచుచున్నాఁడు
లిఙ్గమ్ (న) చిహ్నము-శిశ్నము-శివుఁడు.
లిఙ్గవృత్తిః (పు) వట్టివేషమునబ్రతికెడువాఁడు
లిఖః (పు) ఇల్లలకడము.
లిపిః (స్త్రీ) వ్రాసినవ్రాత
లిపికారః (పు) వ్రాసెడువాఁడు
లిప్తః (త్రి) పూయఁబడినది
లిప్తకః (త్రి) విషముచేత పూయఁబడిన బాణము
లిప్సా (స్త్రీ) కోరిక

లిఖిః (స్త్రీ) వ్రాసినవ్రాత.

లీఢః (త్రి) భుజింపఁబడినది.

లీలా (స్త్రీ) శృంగారచేష్ట - స్త్రీపురుష పరిహాసము - క్రియ.

లుఞ్చతి (ధా) ప-శప్ లుంచాఅపనయనే-పోఁగొట్టుచున్నాఁడు.

లుఠితః (పు) పొర్లాడెడుగుఱ్ఱము.

లుణ్టతి (ధా) ప - శప్ - లుటిస్తేయే- దొంగతనముఁ జేయుచున్నాఁడు.

లుణ్ఠతి (ధా) ప-శప్ - లుఠిఆలస్యేప్రతి భాతేచ - ఆలస్యముఁజేయుచున్నాఁడు.

లుణ్డతి ధా) ప-శప్-లుడి స్తేయే - దొంగతనముఁజేయుచున్నాఁడు.

లుప్తః (త్రి) లోపముఁజేయఁబడినది.

లుబ్ధః (త్రి) లుబ్ధుఁడు - విషయేచ్ఛఁగలవాఁడు

లుబ్ధకః (పు) బోయవాఁడు.

లుమ్బతి (ధా) ప - శప్-లుబిఅర్దనే- యాచించుచున్నాఁడు - వెళ్లుచున్నాఁడు.

లులాయః (పు) ఎనుఁబోతు.

లున్థతి (ధా) ప - శప్ - లుధిదుఃఖే - దుఃఖించుచున్నాఁడు - హింసఁబడుచున్నాఁడు.

లూతా (స్త్రీ) సాలెపురుగు.

లూమ<br>లూమమ్ } (న) తోఁక.

లేఖః (పు) దేవతలు-జాబు.

లేఖకః (పు) వ్రాయువాఁడు.

లేఖనమ్ (న) వ్రాయుటము

లేఖర్షభః (పు) ఇంద్రుఁడు

లేపః (పు) భోజనము-గర్వము-నిందితుండు-సున్నము.

లేపకః (పు) ఉప్పరవాఁడు.

లేశః (పు) కొంచెమైనది.

లేహః (పు) మంటిగడ్డ.

లోకః (పు) జగత్తు-స్వర్గాదిలోకములు-జనులు.

లోకజిత్ (పు) బుద్ధదేవుఁడు.

లోకతే (ధా) ఆ- శప్ - లోకృదర్శనే- చూచుచున్నాడు.

లోకాలోకః (పు) చక్రవాళపర్వతము అనగాభూమిచుట్టునుండు పర్వతము.

లోకేశః (పు) బ్రహ్మదేవుఁడు - బుద్ధదేవుఁడు.

లోచతే (ధా) ఆ-శప్- లోచృదర్శనే- చూచుచున్నాఁడు.

లోచనమ్ (న) కన్ను.

లోచమస్తకః (పు) ఓమవుచెట్టు.

లోటతి (ధా) ప-శప్-లుటవిలోడనే- చిమ్ముచున్నాఁడు.

లోఠతి (ధా) ప- శప్- లుఠఉపఘాతే- ప్రతిబంధముఁ జేయుచున్నాఁడు.

లోడతి (ధా) ప-శప్- లుడవిలోడనే- లోడృఉన్మాదే-చిమ్ముచున్నాఁడు- మదించుచున్నాఁడు.

లోధ్రః (పు) లొద్దుగుచెట్టు.

లోపాముద్రా (స్త్రీ) అగస్త్యునిభార్య.

లోప్త్రమ్ (న) దొంగలించినసొమ్ము.

లోమ(న)శరీరమునందుఁబుట్టినవెంట్రుక.

లోమశా (స్త్రీ) జటామాంసి.

లోహమ్ (న) ఇనుము

లోలః (త్రి) కదలెడిది - ఆశగలది.

లోలుపః } (పు)మిక్కిలిఆశగలవాఁడు
లోలుభః }

లోష్టః (సీ) మంటిగెడ్డ.

లోష్టతే (ధా)ఆ-శప్- లోష్టసంఘాతే- పోసుచేయుచున్నాఁడు

లోహమ్ (న) అసిమి

లోహః (సీ) ఇనుము

లోహపృష్టః (పు) టొబులుగుపక్షి

లోహలః (త్రి) ఏర్పడనిమాటలాడువాఁడు.

లోహాభిసారః (పు) నిర్గ్రహము, [డు.

లోహితమ్ (న) కుంకుమము-హరిచందన[ము

లోహితకమ్ (న) కెంపు

లోహితచందనమ్ (న) కుంకుమము

లోహితాఙ్గః (పు) అంగారకుఁడు

లోహితాహిః (పు) రక్తపాడ

లౌహః (పు) లోహము

లౌహిత్యః (పు) సముద్రము - వడ్లు

**వ**

వ (అ) చింతనము

వః (పు) సాత్విఁకుఁడు-వాయువు - వరుణుఁడు-భయము-పూజ్యుఁడు- బలవంతుఁడు- వస్త్రము - ఓదార్చుటము.

వంశః (పు) వెదురు - వెన్నెముక - పిల్లనగ్రోవి.

వకులః (పు) పొగడచెట్టు.

వక్తవ్యః(త్రి)కుచ్చితుఁడు - చెప్పినట్టుకే యువాఁడు- పలుకఁదగినశబ్దము

వక్త్రమ్ (న) ముఖము-నోరు

[illegible]క్రిమ్ (త్రి) వంకరగిది

వక్రాఙ్గీ (సీ) కటుకగోహిణి

వగ్రహః } (పు) వలవు,అనగాకటువు.
వగ్రాహః }

వఙ్క్యః (పు) వక్రత్వము.

వఙ్క్తే (ధా) ఆ - శప్-వంకరగాఁబోవుచున్నాఁడు.

వఙతి } (ధా) ప - శప్ - నడుచుచున్నాఁడు
వఙ్ఖతి }

వఙ్ఘతే (ధా) ఆ- శప్ - పోవుచున్నాఁడు-నిందించుచున్నాఁడు.

వఙ్గమ్ (న) లగిగము

వఙ్గః (పు) కోశలము - దేశవిశేషము - కొంచెముపొడుగుగలయిట్టి.

వఙ్గతి (ధా) ప-శప్ - నడుచుచున్నాఁ[డు.

వచః } (న)వాక్య
వచనమ్ }

వచా (సీ) వస

వచనేస్థితః (త్రి) చెప్పినట్టుచేయువాఁడు.

వజ్రమ్ (సీ) వజ్రాయుధము-వజ్రము.

వజ్రద్రుః (పు) బొమ్మజెముడుచెట్టు.

వజ్రనిర్ఘోషః } (పు) పిడుగుధ్వని.
వజ్రనిష్పేషః }

వజ్రపుష్పమ్ (న) నువ్వుబువ్వు

వజ్రీ (పు) ఇంద్రుఁడు-మహిషము.

వఞ్చుకః (పు నక్క-ఊరముంగిస.

వఞ్చతి (ధా) ప-శప్-వంచుగతో- పోవుచున్నాఁడు,

వఞ్చితః (త్రి) వంచింపఁబడినవాఁడు

వఞ్జులః (పు) నెమ్మిచెట్టు-ప్రబ్బచెట్టు- అశోకవృక్షము

వటః(పు)మఱ్ఱిచెట్టు-గవ్వ(త్రి)నలత్రాడు

వటతి (ధా) ప-శప్-వటవేష్టనే - చుట్టుకొనుచున్నాఁడు

వటారకా / వటీ } (స్త్రీ) త్రాఁడు.

వటతి (ధా) ప-శప్-వటస్థౌల్యే-స్థూలముగుచున్నాఁడు.

వణః (పు) ధ్వని

వణతి (ధా) ప-శప్-వణశబ్దే - ధ్వనిఁజేయుచున్నాఁడు

వణిక్ (పు) క్రయవిక్రయకారుఁడు, అనగా వర్తకుఁడు.

వణిజ్యా (స్త్రీ) సకలవస్తుక్రయవిక్రయము.

వణ్టకః (పు) పాలు

వణ్టతే (ధా) ఆ - శప్ - వటిఏకచర్యాయాం - నియమముగానుంటు న్నాఁడు

వణ్డతే (ధా) ఆ - శప్ - వడవిభాజనే- విభజించుచున్నాఁడు.

వణ్డః (పు) తోఁకకోసినయెద్దు

వత్ (అ) వలెను - దానివంటిది

వత్సమ్ (న) వక్షస్థలము.

వత్సః (పు) సంవత్సరము-పుత్రుఁడు (స్త్రీ) ఆవులేఁగదూడ

వత్సకః (పు) కొడిసెచెట్టు

వత్సతరః (పు) తఱపిదూడ.

వత్సనాభః (పు) విషభేదము

వత్సరః (పు) అయనద్వయకాలము-సంవత్సరము

వత్సలః (త్రి) స్నేహముఁగలవాఁడు.

వత్సాదనీ (స్త్రీ) తిప్పతీఁగె.

వదః (త్రి) పలుకనేర్చినవాఁడు.

వదనమ్ (న) ముఖము

వదన్యః / వదాన్యః } (త్రి) చాలాయిచ్చువాఁడు

వదాన్యః (పు) మనోహరముగా మాటాడువాఁడు-కుబేరుఁడు - వరుణుఁడు-చంద్రుఁడు.

వదావదః (పు) రాజసభలయందుపలుకనేర్చినవాఁడు.

వధః (పు) చంపుట

వధూః (స్త్రీ) ఆఁడుది - భార్య-కోడలు - స్పృక్కా-యనుగ్రంథ్యము.

వధ్యః (త్రి) చంపఁబడఁదగినవాఁడు.

వనమ్ (న) జలము - అడవి.

వనతి (ధా) ప - శప్ - వనసంభక్తౌ - పోగుచేయుచున్నాఁడు - వనశబ్దే-ధ్వనిఁజేయుచున్నాఁడు.

వనతిక్తికా (స్త్రీ) పాటచెట్టు

వనప్రియః (పు) కోకిలము.

వనమక్షికా (స్త్రీ) అడవియీఁగ

వనమాలీ (పు) విష్ణువు.

వనముద్గః (పు) అడవిపెసలు.

వనశృఙ్గాటః (పు) ఏనుఁగపల్లేరుచెట్టు.

వనస్పతిః (పు) మఱ్ఱిచెట్టు

వనాయుజః (పు) వనాయుజదేశపుగుఱ్ఱము

వనితా (స్త్రీ) స్త్రీ-నల్లవిష్ణుక్రాంత.

వనీకః / వనీపకః } (త్రి) యాచకుఁడు.

వనౌకాః (పు) కోతి

వన్దకః (పు) చిలుతేకుచెట్టు

వన్దతే (ధా) ఆ-శప్- నమస్కరించుచున్నాఁడు-నుతిఁజేయుచున్నాఁడు

వన్దా (స్త్రీ) కొండబెండచెట్టు

వన్దారుః (త్రి) నమస్కారశీలుఁడు.

వన్దిః (పు) స్తోత్రపాఠకుఁడు

వన్ధ్యః (పు) గొడ్డుబోతుటెద్దు

